ఓమ్

శ్రీ విరాట్ జగద్గురు

**పోతులూరి వీర**

# బ్రహ్మముగారి మహిమలు

(జేజినాయన కథలు)



గ్రంథకర్త:

పులికొండ పరబ్రహ్మకవిగారు








శ్రీ సీతారామా బుక్ డిపో, తెనాలి

# ఇందలి కథలు



శ్రీ విరాట్ జగద్గురు

# వీరబ్రహ్మముగారి మహిమలు

అను

## (జేజినాయన కథలు)

శ్రీ విరాట్పద విఖ్యాతం । సిద్ధానంద ప్రదాయకం
వేదాంతార్థ ప్రవక్తారం । వీరబ్రహ్మ గురుంభజే॥

శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామివారు సాక్షాత్ విరాట్పురుషుడైన భగవంతుని యవతారము అని కాలజ్ఞానాదులు చెప్పుచున్నవి. ప్రపంచసృష్టి అయినతర్వాత అనగా నీ కనపడుచున్న భూమి, నీరు, నిప్పు, గాలి, ఆకాశము వీటిద్వారా ప్రత్యక్షములైన కొండలు, వృక్షాలు, తీగలు, పొదలు అందులో సంచరించు మృగములు, పక్షులు మున్నైన వాటితో నాడుకొనుటకు, ఆనందించుకొనుటకు, కష్ట సుఖాదు లనుభవించుటకును మంచి తెలివితేటలుగల మానవజాతి యేర్పడినదై తమ బుద్ధి వికాసమువలన నిది యంతయు భగవంతుడనే వాడొకడు, కల్పించిపెట్టి మన యానందము, అభివృద్ధి మొదలయినవాటిని చూచుచు వినోదించు చుంటాడని నమ్మి నడకలు సాగించు

చుండుట లోకచరిత్ర యందలి ప్రధాన వృత్తము – అయితే పువ్వు పూచి, పరిమళించి, అందాన్ని చూపి, ఆనందాన్ని కలిగించి రాలిపోయినట్లే మానవుడుకూడా అవతరించి యనేక విషయాలెఱింగి, యద్భుతములైన కార్యాలొనర్చి యాడిపాడి విజ్ఞానవంతుడై, పేరుగాంచి, అంతరించుచున్నాడు. పూవు పోయిన తర్వాత మరల క్రొత్తపువ్వు పుట్టి గుమగుమ లాడు నట్లే మానవుడును మరల పుట్టి మంచి చెడ్డ చేయగలుగు చున్నాడు. తమ విజ్ఞాన విశేషమువల్లఁ బరోపకారము మొదలైనవి చేయుచు, చేయించుచు, చేయింపబడుచు ప్రవర్తింపగలుగుచున్నాడు. ఈ ప్రవర్తనలో గల మంచి చెడుగు అనే వాటిద్వారా ప్రశాంతము, భయంకరముఅనేవి ఏర్పడి కాలస్థితి ననుసరించి మంచికన్న చెడ్డదొడ్డదికాగలుగుటచే ప్రపంచశాంతి పటాపంచలు కాసాగినది. వివిధరూపాలతో మతములు పుట్టి మానవులలో హెచ్చు తగ్గులు కల్పించి వారి నాశనమునకు గారణ భూతములైనవి. బలవంతుడు బలహీనుని పై బడి బాధింపుచున్నాడు. ఒక మతమువాడు మరియొక మతస్థుని మాడుపై గొట్టి జూచుచున్నాడు. ధనము గలవాడు ధనహీనుని కొంచెపరచుచున్నాడు. నీచుడు నీతివంతుని వెక్కిరింపుచున్నాడు. పరస్త్రీ వ్యామోహము, గురుజనధిక్కారము, క్రూరకార్యాచరణ మిక్కుటము కాసాగినది. అట్టి స్థితిలో నెవరో యొక మహానుభావుడు పటాటోపముతో భగవంతుని యవతారముగా బయలుదేరి వచ్చి తన బలపరాక్రమాదులు వినియోగించి ప్రపంచశాంతిఁ జేకూర్చి పోవుచుండుట పరిపాటియైనట్టుగా పూర్వుల వాక్యాలు, పురాణ గ్రంథాలు మనకుఁ

దెలియజెప్పుచున్నవి. పురాణ కాలములో, అత్యాచారులైన దుండగీంద్ర భారమును, సహింపజాలక భూదేవి మొరపెట్టు కొనగా, నామె భారమును తీసివేయుటకై శ్రీమన్నారాయణ స్వామి శ్రీ కృష్ణమూర్తిగా నవతరించిన విధముగా, దేశ మందలి హిందూ మహమ్మదీయ మత పోరాటాల కుంబల ముగా బౌద్ధ, వైదిక మతముల సంఘర్షణ తటస్థించిన కాల ములో, బయలుదేరిన మత విప్లవముల యుద్ధతి అనగా (హిం దువుడు తన కులాచారము ననుసరించి గంధాక్షతలు గాని, తిరుమణి- తిరుచూర్ణములు గాని మొగమున ధరించి బజారున వెళ్ళుచుంటే, మహమ్మదీయు డెదురుపడి వాని మొగమున 'ధూ' యని యుమిసి యసహ్యించుకొనుచుపోవుట. మహమ్మ దీయుడు కార్యావసరమున హిందువు నింటికి వచ్చినచో నతని నానా దుర్భాషలాడి కొంచెపఱచి పంపించుట మొదలైనవి) వైదికమతస్థుడు మానవుడు చేసే పాప పుణ్యముల ననుసరించి, చచ్చిన తర్వాత నరకశోకాన్నో, స్వర్గసుఖాన్నో అనుభ వించి; మళ్ళీ పుట్టి మళ్ళీ పెరిగి, మళ్ళీ చచ్చి యిట్లా పౌనః పున్యముగా యీ జీవుడు మళ్ళీమళ్ళీవస్తూ, పోతూ వుంటా డంటాడు. బౌద్ధమతస్థుడు పంచభూతాత్మకమైన యీ శరీరం పడిపోయిన తర్వాత, మన్నులో మన్ను, నీరులో నీరు, నిప్పులో నిప్పు, గాలిలో గాలి, బయలులో బయలు కలిసిపోవుటచే నేమియు నుండదనియు, బ్రతికియుండినప్పుడే పరమార్థవంత ములైన జీవకారుణ్యాము, (సర్వ) మానవ ప్రేమ, మున్నైన మంచిపనులు జేసి మానవుడు తరించవలెననియు బోధిస్తాడు. శివమతస్థుడు కోటిజన్మలెత్తి సంపాదించిన పుణ్యామువల్లగాని

దొరకని యీశ్వరభక్తి లభించినచో మానవుడు తరించగల డంటాడు, విష్ణుభక్తుడు సర్వవ్యాపకుడైన శ్రీమహావిష్ణువును స్మరించినంతనే మానవుడు తరించునంటాడు. అడ్డబొట్టు వానిని జూచి నిలువుబొట్టువాడును, నిలువుబొట్టువానిని గని యడ్డబొట్టు వాడును యసహ్యకరముగ మాట్లాడుతాడు. యీ విధములైన భేద భావాల మూలముగా దేశమం దేర్పడిన భయంకరస్థితి కోర్వజాలక, భూదేవి వైకుంఠమునకు పోయి మరల దేవురించగా. ఆ నారాయణమూర్తియే, దేశకల్యాణముకొఱకు బ్రహ్మదేశికుడుగా నవతరించినాడు, అని చరిత్రసిద్ధాంతము. ఆనాడు శ్రీకృష్ణుడు పుట్టిన మరుక్షణము నుండియు మహిమల జూపించి ప్రజలయొక్క భక్తి విశ్వాసాదులఁ జూరగొనినట్లుగా బ్రహ్మముగారును చిన్ననాటి నుండియు జిత్రవిచిత్రములైన చేష్టలఁ బ్రకటింపసాగిరి. అవి యానాటి ప్రజలయొక్క భక్తి విశ్వాసములకును నీతి నియమములకును, నిదానములై పరిమళించి లోకుల యానందోత్సాహముల జూఱగొనినవి.

అయితే శ్రీకృష్ణమూర్తి లోకమందలి దుర్మార్గులను సంహరించుటకై యవతరించిన మహాపురుషుడు గనుక, ఆయనకు జిన్న నాటినుండియు పూతన, తృణావర్తుడు, శకటాసురుడు మొదలైన వారెందరో విరోధులు బయలుదేరి పాలిచ్చే నెపంతోను, చల్లగాలికి తీసుకుపోయే పనితోను, ఉయ్యాల నూగించే పేరుతోడను వచ్చి యపకారము చేయబూని యధోగతి పాలైన వారై 'చెరపకురా చెడేవు' అనే సామెతను

సార్థక పఱచిరి. బ్రహ్మముగారు, దేశమందలి దుర్మార్గులను సన్మార్గులుగా చేసి కాపాడవచ్చిన మహాత్ముడగుటచే నాయన కే విరోధియు లేకుండుటవలన ఏ సమయమందో చూపవలసి వచ్చిన ఆయనమహిమలు ప్రజలకు చాలవఱకు భక్తివిశ్వాసములనే కలిగింపసాగినవి. అందులో ప్రతిచ్ఛాయ (నీడ) గన్పడకుండుట మొదలైన వెన్నో కలవు. పాఠకులు వాటిని శ్రద్ధగా చదివి బ్రహ్మముగారి ప్రతిభాసంపద, యోగశక్తి మున్నగువాని నెఱుంగుదురు గాత.

చ॥ మతముల వక్రపద్ధతులు మార్పడ, లోకహితైక భావనా
ర్ద్రితమగు బుద్ధిఁ గ్రొందళుకుతీరుల సత్యపథ స్వరూపముల్
ధృతివెలయించి సర్వసమదృక్కుల జూచిన దేశికోత్తముం
డతఁడవతారమూర్తిగద ! ఆర్యచరిత్రల సంకుండినక్



## 2 అవతారమూర్తి

శ్రీ బ్రహ్మముగారు బాల్యమునందు, నందికొండ, పాపఘ్ని పీఠాధ్యక్షురాలగు వీరపాపాంబగారికి, దత్తపుత్రుడుగాఁ బెరుగుచుండెను. శ్రీకృష్ణుడుకూడ నంతే, ఆయన సుప్రసిద్ధ రాజవంశీయులగు దేవకీ వసుదేవులకు జన్మించిన వాడై, యాదవరాజ కుటుంబములోని వారగు యశోదా నందరాజుల దత్తపుత్రుడుగా పెరిగి పెద్దవాడయ్యెను. బ్రహ్మముగారు కూడ ప్రకృతాంబా పరిపూర్ణుల కుదయించినవాడై వీరభోజ గురుదంపతుల పాలనలో ప్రతిభాశక్తులు మున్నైనవి ప్రకటిం

చెను. ఆయన అవతారపురుషుడు, ఈయనయు అవతార పురుషుడే.

సామాన్య మానవుడు బుద్ధిసాధ్యములగు వానిని, తన విజ్ఞాన విశేషముద్వారా తెలుసుకుని వెల్లడించును, అవతార పురుషుడో మానవ మాత్రుడు గ్రహింపరాని మంచి చెడుగులు మున్నగువానిని ఆత్మశక్తివల్ల నవలోకించి, వాటిద్వారా ప్రజాహితము చేకూర్చగలడు. ఈ విషయములు శ్రీకృష్ణుల వారి చరిత్రయందును, బ్రహ్మముగారి కథలోను తెల్లముగా గలవు. ఆనాడు బ్రహ్మముగారి పేరు "వీరప్ప". వీరప్ప అంటే యూరివారందరికిని ప్రేమయే; వారెల్లప్పుడును ఆ బాలకుని చూచి యానందిచుటకును, ఎత్తుకొని ముద్దు లాడుటకును గోరుచుందురు. ఎందుకంటే ఆ బాలుడు చాల చక్కదనము గలవాడనియు, సాటిలేని సౌందర్యముతో ప్రకాశించు నా ముద్దుమొగము నందెప్పుడును చిఱునవ్వు తొణుకులాడు చుండు ననియు ఎన్నడును ఏడ్పనుమాట నెఱుంగక నాడు కొనుచు నేదో యవ్యక్తానందము వెలువరించు చుండుననియు, మొదలుగా ననేకాద్భుతము లాబాలుని చేష్టలద్వార వెలువడు చుండెను. ఇటువంటి వెన్నో బాలకృష్ణుని లీలలలోను, బాల వీరప్ప విలాసములలోను కూడా మనము చూడగలము.

అయితే ఆ పెంపుడుతల్లి మాత్రము లేక లేక ఎన్నాళ్ళకో లభించిన బిడ్డ యగుటచేత నెవనికంటఁబడిన నేదోసము గలుగునేమో? ఎవని స్పర్శవలన నే యాపద సంభవించునో? యనే భీతిచే నేదో వంకచెప్పుచు నెవరికిగాని యంతగా నా

బాలుని జూపించ నిచ్ఛగించునది కాదు. కాని, యే పురుషు డా చిన్నవానిని దర్శింప నిచ్ఛగించునో, ఆయనకు వీరప్ప దర్శన మిచ్చేవాడు. ఏ స్త్రీ యీ బాలు నెత్తుకొన నుబలాట పడునో, వీరప్ప యామె యొడిలో కిల కిల లాడుచు ముద్దులు గులికించేవాడు. (శ్రీ)కృష్ణులవారుకూడ గురుజనుల విషయ ములో గోపికాంగనల విషయములో నిట్లే వ్యవహరించు వాడు – అందుచేత, వీరపాపాంబగారి యీ పద్ధతి యెవరికిని వెగటు గలిగించ లేదు.

ఆ తరువాత ఆయన చదువుకునే బడిలో తోటి బాలు రందఱికంటె తెలివితేటలలోను నడవడికలోను పాఠముల గ్రహించుటలోను మిన్నయై ఒక్కొక్క సమయములో ఉపా ధ్యాయునికి గూడ తెలియని సంగతులఁ దెలుపనేర్చి యాశ్చ ర్యమును గలిగించుచుండువాడు. ఇంటిదగ్గఱ నుండునప్పుడు, వీర దర్శనార్థము వచ్చే స్త్రీ పురుషులకు ముద్దు ముద్దుగా చక్కటి విషయాలు తెలియజెప్పుచు వారి కానందాశ్చర్యములు గలి గించుచుండువాడు. అందుచే 'వీరంభట్లు' (వీరప్ప ముద్దు పేరు) అనినఁ బురవాసు లందఱికీగూడ సంపూర్ణమైన యభి మాన గౌరవములు కలిగియుండెడివి. అనేక నిదర్శనములు వెల్లడియైన మొదటిరోజులలో నిట్లు భావించినను, తరువాత ఆబాలగోపాలమైన ప్రజలందరు నాతడొక దేవతాంశగల పురుషుడుగా భావించి, గౌరవింపసాగిరి.

ఈ కథవలన గొప్పవాడు కాబోవువాడు తన గొప్ప తనము నాదినుండియు నేదో యొకవిధముగా వెలువరించు చునే యుండునని తెలియుచున్నది.

ఉ॥ చక్కని లేతమొగమ్ము నునుచాయలనీనెడి నవ్వు రేకలన్
జిక్కని తీవి నే తలపు చిన్నెలొ వన్నియలీయ నెంతయున్
మక్కువజూపుచున్ దనుఁగనన్ జనుదెంచు వివేకవంతులన్
దక్కువలేని సమ్మదమునన్ గయిసేయు నతండు లీలగా.



## 3. ఎండలో సర్పము పడగవిప్పి నీడగా పట్టుట

శ్రీ బాలబ్రహ్మమూర్తి భగవదంశా సంభూతుఁడని, తేజోమూర్తియైన యాతని యందచందాలు, ఆటపాటలు, మాటతేటలు, మంచితనము మున్నగు సంగతుల నెన్నుచు గ్రామవాసులందరు నానందముతో మెచ్చుకొనసాగిరి ఆ మెచ్చులు హెచ్చుస్థాయిలో నాకాశము నంటి, దిక్కులదాకి దిగువ నున్నయా...యూరంతటఁ బ్రాకి పరిమళింపసాగెను. ఏ యింట జూచినను బాలబ్రహ్మమూర్తి పలుకుల తీరు తీయముల గూర్చి ముచ్చటించుకొనువారే. ఏ వీధులలో జూచినను వీరపాపమ్మగారి కుమారుని వింత వింత చేష్టలఁ బ్రశంసించువారే. గృహములలో పనిపాటలు చేసుకునే యిల్లాలు, పొలములో వంటలు పండించుకునే రైతు, గదిలో భార్యతో సరసములాడే యువకుడు, బడిలో పాఠాలు వల్లించే బాలుడు, వీరప్ప వింతకబుర్లు చెప్పుకుని సంతోషపడుటతోడనే సమయములు గడుపుచుండిరి. అయితే యీ మంచివాసన – మూర్ఖుడైన బడిపంతుల కిష్టములేకుండెను.. ఆతడది యంతయు నొక విధమైన యభిమానముతో గూడిన డాంబిక ప్రచారమని

పల్కుచుండువాఁడు. కాని ఆ పల్కులయొక్క సమాధానము లలో నాతని కెదురువచ్చు మాటలే యెక్కువగా ముందుకు దూకుచుండెను. అందుచేత నొక నాఁడాయన మనసులో చింతించి యిందలి నిజానిజములను లోకులకుఁ దెలియఁజే యుదునని తలంచినవాఁడై యొకనాఁడు నలుగురు స్నేహితులు రాఁ జూచి యేదియో యొక నెపము కల్పించి బడిలో చదువు చున్న యా బాలు నెండలో నిలువఁజేసెను. కాని ఆతని మన స్సులో మాత్రము ఏదో భయముగానే యుండెను. ఎందు కంటె; ఆయన విలాస విశేషములను, వివరించి చెప్పె సందర్భ ములో ఎండలోను, వెన్నెలలోను కూడ నా బాలుని నీడ నింత వఱ కెవ్వరును చూచియుండలేదని యనేకు లాయనతో వాదించియుండిరి. అందుచే నాతఁడెంతగా బోకరించినను మనసుమాత్రం సత్యమువైపే మరలుచుండెను. వీరప్పమాత్రం పంతులు విధించిన శిక్షకు లోనై భయభక్తులు ప్రదర్శించు చుండెను. అంతలో, హఠాత్తుగా నెక్కడనుండియో పెద్ద సర్పమొకటి బుసగొట్టుచువచ్చి, యైదు శిరస్సులతోడి విశాల మైన తనపడగను విప్పి యాబాలమూర్తి కెండ తగులకుండ నిల చెను. అదిచూచి యా పంతులు గడగడ వణకుచు భయా వేశమునొంది, పశ్చాత్తాపముతో నా బ్రహ్మ బాలునకు ఎదురుగా సాగిలబడి మ్రొక్కి 'స్వామీ! సర్పరాజా! యప రాధము. మూర్ఖుడనై తెలియక చేసితిని. నా తప్పును క్షమిం పుము. యీ మహా పురుషమూర్తిని గుఱించి యింకెన్నడును విమర్శింప తలపెట్టను. మఱి యే యపవాదమును గలిగింప బూనను. మీదు మిక్కిలి గౌరవముతోఁ జూతును,' అని

ప్రార్థింపగా, నా సర్పరాజు ప్రశాంతముతో వెడలిపోయెను. అంతట పంతులా బ్రహ్మ బాలకుని నెత్తుకొనిపోయి మర్యాదతో నుచితరీతిఁ గూర్చుండ జేసి నమస్కరించెను. అంతటి నుండియు నా పంతులాతని భగవత్ స్వరూపునిగా దలచి నమ్రభావముతో గౌరవింప సాగెనట.

ఈ కథ చిన్న గొప్పతనాల నెంచి యెవ్వరి విషయము నను కూడ అసూయ చెందరాదనియు, గొప్పతన మనునది సహజముగా మొదటినుండియు నాయా చోటుల నేదో యొక విధముగా కనబడుచునే యుండుననియు భోధింపుచున్నది.

ఉ॥ ఓరుపుదూరమై పరుల యున్నతికోర్వని దుష్టభావముల్
జేరువగాగ దుష్కృతులఁ జేయఁగడంగును మూఢుఁడాతనిన్
ధీరులు మందలించిన మతిన్ మరలించుకొనంగ జాలఁ డా
తీరులు సత్యదర్శన విధిన్ దలఁదన్ని నఁగాని యుద్ధరన్



## 4. విశ్వరూప ప్రదర్శనము

బ్రహ్మముగారు పన్నెండేండ్ల వయస్సు గల బాల్యము నందే యొకనాడు పెంపుడు తల్లియైన వీరపాపాంబగారి దగ్గఱకు వచ్చి నమస్కరించి "తల్లీ! నేను ప్రపంచజ్ఞానము మున్నైనవి, సంపాదించుకొనుటకు దేశాటనముఁ జేయ సంకల్పించుకున్నాడను. కావున అనుగ్రహించి నన్ను దీవించి పంపుము" అని యడిగెను. యీ మాటలకామె తెల్లవోయి 'ఇదియేమప్పా! నీవు చిన్న వాడవుగదా? యీరోజులలో కష్టపడి దేశాలు

తిరుగ గలవా? బాలుడవైన నీవు ఆక్రొత్తచోటులలో నెక్కడ నెవరి నెఱుగుదువు? వలదు నాయనా! మరియొక సమయమున వెళ్ళుదువులే" అని మరి యేమేమో చెప్పెను. వివేక వంతుడైన యాతడామె హృదయము నెఱింగినవాడై "అమ్మా! నీవు నీప్రేమ కొలది ముందు వెనుక లాలోచింపక తెలిసియుఁ దెలియని దానివలె పల్కుచున్నావు. అందుకే పెద్దలు ప్రేమ గుడ్డిది యన్నారు. సాధారణముగా దానికి తొందర పాటెక్కువగా నుండునుసుమా! వివేక వంతురాలవగు నీవు కూడ నట్టి యనాలోచన, యసంభావన సందడించు తొందర పాటునకులోనై, చెందనుండిన వెలుగు నరికట్టజూచుట ధర్మమా? మానవుడు పరస్థాన దర్శనము చేసి యందలి పరమార్థము లెఱుంగనిచోఁ బనికిమాలిన వాడగునుగదా? తెలివి సంపాదించుటకు జిన్న తనము, పెద్దతనము అను వయో నిర్ణయ మున్నదా? తాయీ! మానవుడు పుట్టిన కొలదికాలమునకే పురుగులోని సౌందర్యము, పుష్పములోని సువాసన, ఫలములోని మాధుర్యము గ్రహింపఁ గలుగుచున్నాడుగదా? అట్టిచోఁ బన్నెండు సంవత్సరాల ప్రాయము చెల్లిన యీ బాలమూర్తికిఁ బరిచయ దూరమనునది యుండునా? యోచింపుము తల్లీ యోచింపుము" అని తగినట్లుగా సందర్భము లన్నియు తెల్పినవాడై, మున్ను గృహస్థాశ్రమము చెందకుండా బ్రహ్మచర్య దీక్ష నవలంబించుటకై హనుమంతుడును, సన్యాసాశ్రమము నొందుటకై శంకరాచార్యుడును, తల్లిగారి యనుమతిని కోరిన విధములు కూడ వివరించి తన మనోనిశ్చయ మెఱుక చేసెను.

కాని ఆ తల్లిగారు పుత్రప్రేమ కారణముగా వియోగమును పట్టజాలక నెన్ని చెప్పినను ఇష్టపడకుండెను.

పూర్వము అవతార మూర్తులగు కృష్ణ, బలరాముల చిన్నతనపు ఆటల సమయములో, నొకప్పుడు, శ్రీకృష్ణుని బలరాముడు తల్లిదగ్గఱకు పట్టుకువచ్చి అమ్మా! ఈతడు మన్ను తినుచున్నాడని చెప్పెను. అంతనాతడు తల్లీ అది కాదు చూడు మని, నోరు దెఱచి యందు బ్రహ్మాండపంక్తు లన్నియు నుండు టచూపి యచ్చెరపాటు గలిగించెను. ఆవిధముగానే, తాత్పర్య వంతమైన యద్భుతమేదియైన జూపెట్టినగాని, తల్లిగారు దేశ కళ్యాణమునకైన, తనగూఢ సంకల్పము నంగీకరింపదని, తలచినవాడై యీ బాల వీరప్ప 'తల్లీ యిటుచూడు' మని రెప్పపాటు కాలములో "సహస్రశీర్షాపురుషః" అన్నట్లుగా ననేక శిరస్సులును అనేకములైన కన్నులు, ముక్కులు, నోళ్ళు, కాళ్ళు చేతులుగలిగి చరాచర ప్రకృతి యంతయుఁ దాన యైనట్లు, విరాడంశమైన తన విశ్వరూపమును చూపి విస్మయ, భక్తి వివేకాదుల గలిగించెను. అప్పుడామె యాశ్చ ర్య చకితయై యున్నొకప్పుడు తన భర్తగారు 'యీ బాలుడు లోకమందలి దురాచారము నడంప నవతరించిన భగవంతుని లీలాస్వరూపము' అని చెప్పినది జ్ఞప్తికిరాగా మనసా సంతృప్తి పడినదై యీయన చెప్పినట్లుగానే కేవల మీ బాలుడు ప్రపంచ నిర్మాణ కారకుఁడైన భగవానుడేకాని సామాన్యుడు గాడనియు నాతని యభిప్రాయము నడ్డగింపరాదనియు, నమ్మి

నమస్కరించి వినయముతో మరి యేమియు పల్కనెంచక నాతని కోరిక ప్రకారము దీవించి పంపెను.

ఈ కథవలన 'బాలాదపి సుభాషితం' అన్నట్లుగా చిన్న వారి ప్రయత్నమును, పనులలోను కూడ ప్రయోజనకరమైన భావములుండు ననియు, పెద్దవారా విషయము లూహించి చేయవలసిన పనులను చక్కగా చేయించుట యుచితమనియు తెలియుచున్నది.

మ॥ తనయౌన్నత్య మెఱుంగ జేయుటకునై తాత్పర్యముం బూని చ
క్కనియుక్తిన్ బ్రకటించె నైజమగు లోకవ్యాపకత్వాంశ; నా
ఘనుఁ డాహా! యనియావివేకవతి దిగ్భ్రాంతిన్ గనన్ జాలి మె
చ్చెను, ఆధీరుని వాంఛితంబులకు నాశీర్వాదముల్ సేయఁగన్



## 5. బ్రహ్మముగారి బాల్యములో

బాలవీరప్ప చదువుకొనే రోజులలో, పాఠశాలనుండి విడిపడుట తడవుగా స్నేహితునితోగూడ సమీపమందలి యడవిలోగల చెట్ల నీడలోను, ఏటియొడ్డునను, పొదలచాటు నను తిరుగుచుండు వాడట. ఆతిరుగుట యందు స్నేహితుని ద్వారా, ఏదోసంభాషణము, ఏదోసాధనము, ప్రభలితమగు చుండేదట. ఆతడు ఎండవేడిమినిగాని, వాన తాకుడునుగాని, వాయుశీతలముగాని లక్ష్యపెట్టక యథాస్థితిలో నుండువాడట. తేనెటీగలవల్ల గలిగేబాధ, దుష్టకీటకాలవల్ల తలయెత్తేయప కారము, క్రూరమృగాలవల్ల సంభవించే భయము, ఆధీరునే

మాత్రము చలింపజేసెవి గావట. ఈ విషయమే కాబోలు బాలవీరప్ప శరీరముపై, యీగవాలుటగాని, చీమ ప్రాకుట గాని యేనాడును కలుగలేదనియు, ఎండలోగాని, వెన్నెలలో గాని, నిలచియున్నప్పుడు ప్రతిచ్ఛాయ (నీడ) కన్పడదనియు, చరిత్రకారులు వ్రాసియున్నారు.

భిన్నశక్తులుగల, వెలుతురు, వేడి, వేగము. అనునవి మూడును విద్యుత్తులో గలవు. దీనికి ప్రతిరూపము లేదు. దీని వల్ల మానవ దుస్సాధ్యములైన యెన్ని మహాకార్యములో అద్భుతముగా నిర్వహింప బడుచున్నవి.

వీరునిలో చూడదగిన ఉత్సాహ ప్రభుమంత్రశక్తులు, శూరునిలో చూడదగిన, శ్రద్ధా సామర్థ్య పౌరుషములు, జ్ఞానిలో చూడదగిన, భూత భవిష్యద్వర్తమాన విషయములు, వారి యందప్రతిమాన ప్రతిభా సంపన్నములై కలవు. అందుకే, ఆ మహాత్ముని ప్రతికార్యమందును అనన్యసామాన్యమయిన ప్రభావము గోచరింపుచుండును.

ఒకనాడా వృక్షవాటికలో బాల బ్రహ్మముగారి మిత్రుడు (యితడే ఆయన గృహస్థాశ్రమము నొందిన తర్వాత శిష్యుడుగా చేరిన ఏకాంబర యోగి అంటారు.) ఒక యుసిరిక చెట్టు మూలమున కూర్చుని జపము చేసుకొనుచుండెను. బాలబ్రహ్మమూర్తి కొలదిదూరములో కూర్చుని యచ్చట గల కోతిపిల్లలతో నాడుకొనుచుండెను.

ఇంతలో జపము చేసుకొనుచున్న బ్రహ్మచారి కెవ్వున కేకవేసి ఓమిత్రుడా వీరన్నా! వీరన్నా! రమ్ము రమ్ము నా

ప్రాణవాయువులు తబ్బిబ్బులగు చున్నవి అని యరచెను. బాలబ్రహ్మము వెంటనే లేచివెళ్ళి ఏమప్పా అట్లరచితివేల! అని పలికెను.

అతడు కన్నులుతెరచి వణకునుండి కొంచెము సేద దేరినవాడై, గుండెమీద చేయివేసుకుని, ఏమందునయ్యా ఆరు త్రాచుపాములు, పడగలువిప్పి బుసలుకొట్టుచు నా మీదకు రాసాగెను. కాని యెందుకోగాని అంత దూరమందే నిలబడెను, వాటిని చూడగనె నాప్రాణము లెగిరిపోయినవి. శరీరమంతయు వణకసాగెను, ఎట్లో తమాయించుకుని, చేయు నదిలేక నిన్ను బిలచితిని అనియెను.

బాలబ్రహ్మమూర్తి నవ్వుచు యాతని వీపుపై తట్టి ఓయీ! నీసాధన చక్కబడుచున్నదిలే, యింకను కొన్నిరోజులు శ్రమించుము ఫలితము నందగలవు. ఆ పాము లారును కామక్రోధాదులయిన యరిషడ్వర్గములు. అవి మానవుని మనోవృత్తుల నరికట్టి హీనమార్గముల నడిపించును. ప్రస్తుతమవి నీమీదకు రాజాలక దూరమందే నిలచినవి, మరికొన్ని రోజులకవి మాయమై పోగలవు. ఈ విధముగనే శ్రద్ధగా కృషిచేయుచుండుము, అనెను. అనంతరము వారేదో చెప్పుకుని యింటికి మరలిరి.

ద్వి॥ కామాది శత్రువర్గము జేరరాని
నీమనిష్టలదెల్పె నెచ్చెలికతడు
తన మనీషాశక్తి తళుకుల నీన
నేర్చె నేర్పుము అనేనీతి చెల్వార ॥

★

# 6. శ్రీశైలములో

వీరబ్రహ్మముగారు చిన్ననాడు తల్లిగారి యాజ్ఞఁ దీసుకుని దేశాటనము జేయు సందర్భములో శ్రీశైలయాత్రను చేసెను. అప్పు డక్కడ, మల్లికార్జునస్వామివారి గుడికి పడమరగా ప్రవహించు సరస్వతీ వాహినికి దగ్గరగానుండిన మఠాలలో, నొకదానియందు, మన వీరప్పయ్యగారు కూర్చుండి ధ్యాన నిష్ఠలో నుండెను. ఆ సమయము నందక్కడ నివాసముగా నుంటున్న సన్యాసుల గుంపు, నదిలో స్నానము చేసి బిల బిల లాడుచు వచ్చి, అట్టహాసముతోఁ కేకలు వేయుచు నా బాలబ్రహ్మమూర్తిని లేచిపొమ్మని యఱచిరి. నిష్ఠానిమగ్నుడైన యాయన యేమియు వినిపించుకొనలేదు. అందుకు వారు మిక్కిలిగా తూలనాడుచుఁ జేయిబట్టిలాగిరి. భుజములు బట్టి యూగించిరి. రెండురెక్కలుబట్టి లేవనెత్తఁ జూచిరి. ఆ గంభీరమూర్తి కొంచెమేని చలింపలేదు. నాడు గంధమాదన పర్వతముపై, త్రోవ కడ్డముగాఁ బరుండిన ముసలి హనుమంతుని తోకను కదలించుటకై, బలపరాక్రమ సంపన్నుడైన భీముండెంతగా కష్టపడెనో అంతకంటె పదిరెట్లుగా బలాదులుపయోగించి యా బైరాగి వస్తాదు లీ బాలబ్రహ్మమూర్తిని కదలింపఁజూచిరి. కాని, ఫలితము గలుగలేదు. అందువలన మరింత క్రోధము వారి నావేశించెను. పూర్వము పది తలలు, నిరువది చేతులు గలిగి, పదునాల్గు లోకములను జయించిన పౌరుషశాలియని పేరుగాంచిన రావణాసురుని వంటి గొప్పవాడు, భూమిచే నాకర్షింపబడిన, శివలింగమును పెరుకుటకై

యుపయోగించిన శక్తికంటె, శతాధికముగా, జప తపాదు లతో జవసత్వము లార్జించిన వారును, జ్ఞానము గలవారు నైన బైరాగి మహాశయులందరును, పట్టుబట్టి, యా బాలతప సిని కదలింపజాలక, విఫలులై. విసిగి, వేసారి, తెల్లమొగాలు వేసి, చేయునదేమియు లేక, నిక పరుల సహాయముతో, పని నెరవేర్చుకొందమని బైటకు పరుగెత్తిరి. ఆ సమయమందా కస్మికముగా పెద్దవాన ధారాపాతముగా కురియసాగెను. అప్పుడా ప్రదేశముల నటూ నిటూ పోవుచున్న జనులందరు, వానదెబ్బకు తట్టుకోలేక, నా మఠములలోనికి జొరఁబడిరి. కాని బైటకుపోయిన బైరాగులుమాత్ర మా వర్షములోనే తడియుచు నావలకు నీవలకు తిరుగుచుండిరి. కాని, లోనికిరా బ్రియత్నింపనే లేదు. అంతవఱకుఁ దపోనిమగ్నుడైయున్న మన బాలయోగి మెల్లగా కన్నులు దెఱచి ప్రశాంతముగా నా వచ్చినవారిని కూర్చుండుడని పల్కి మృదుమధుర వాక్యము లతో, జీవనకారుణ్యము, దైవభక్తి మున్నగువానిని గూర్చి చక్కగా బోధింపసాగెను. ఆ వచ్చిన జనులు వర్షము మాట మరచి, బ్రహ్మానంద పరవశులై యా మంచి మాటలలోని యమృత సారమును గ్రోలుచు ప్రశాంతముగా గూర్చుండిరి.

కొంతసేపటికి వర్షము వెలిసెను. ఆగంతుక ప్రజలా బాల పండితునికి నమస్కరించుచు నొక్కరొక్కరే వెడలిపో సాగిరి. అంతవరకు మన బైరాగి మహాశయు లందఱును బైట వానలో దడియుచునేయుండిరి. చలికి వణకుచునేయుండిరి. వారికి లోపలివారి మాటలు వినబడినవో, లేవో అట్లా జనులు

వెళ్ళిన తర్వాత వారి మైకమువదలి, బండతనము పటాపంచలై ప్రపంచజ్ఞానము కలుగగా, నీవలకు వచ్చినవారై యీాయన యెవరో మహానుభావుడని తలపుకల్గగాఁ దా మొనర్చిన మూఢ కార్యమునకుఁ బశ్చాత్తాపమునంది యీాయన పాదములకడ సాగిలపడి మా యపరాధము క్షమింపుమని ప్రార్థించిరి.

అంతట మహాత్ముడైన యీా బాలబ్రహ్మ మనుగ్రహిం చినవాడై క్షమా శీలమును గుఱించియు, సర్వసోదర న్యాయ మును గురించియు వారికి చక్కగా బోధించి జ్ఞానోపదేశమును జేసెనట. ఈ బైరాగులా మఠములలో బిచాణాలు వేసుకుని తమ సొంత యిళ్ళుగానే భావించుకొనుచు, నితరుల నెవ్వరిని అచ్చటకు రానీయక స్వేచ్ఛగా ప్రవర్తింప నలవాటుపడియుం డిరి. మఱి యెదురుచెప్పు వారెవరును లేకుండుటచే తమ నిరం కుశ విహారములలో దయాదాక్షిణ్యములు కూడ విడచిపెట్టి యెటువంటివారు వచ్చినను తిరస్కరింపుచు నధికారము చలా యించుచుండిరట. అందుచే మన బాలబ్రహ్మముగా రీవిధ ముగా తమ శక్తి యుక్తులను ప్రదర్శించి వారిని సన్మార్గ వర్త నుల గావించెను.

ఇందువలన బ్రహ్మముగారు చిన్ననాడే యింద్రియా దుల జయించి యితరులచేత భంగపడని యాత్మశక్తి సంపా దించెనని మనకు తెలియుచున్నది.

మ॥ తమదౌ సంఘబలంబె చాలునని యాద్ధత్యాన లేకెత్తి నా
యము బాటింపని వారికిఁ దగిన ప్రాయశ్చిత్తముం జేయఁ జి
త్తమునం దెంచిన బ్రాహ్మబాలకుని సత్సంకల్పముఁ దత్ప్రభా
వము నెంతేఁ గొనియాడిరా పరిసరావాస ప్రజానీకముల్ ॥



## 7. కుందేటిలో గ్రుద్దులవాన

తీర్థయాత్రలన్నియు ముగించిన తరువాత వీరప్పయ్య
గారు అల్లాటపల్లెలోగల వీరభద్రస్వామివారిదగ్గర విద్యాభ్యా
సము చేసెను. వీరభద్రస్వామిగారు సకలవిద్యాసంపన్నులైన
యోగపురుషుడు. వానప్రస్థాశ్రమపరుడైన యామహనీయుడు
పవిత్రమైన కుముద్వతీనది (కుందేఱు) దగ్గరగా ప్రవహించు
చుండుటచే అల్లాటపల్లెకు సమీపము నందొక యాశ్రమము
కల్పించుకుని యందు పలువురుశిష్యులు సేవింపుచుండగా యో
గాది మహావిద్యలు బోధింపుచు, నిర్మలములైన కుందేటి చల్లని
జలముల మీదుగా వచ్చు పిల్లవాయువుల సుఖస్పర్శలవలని
యానందము ననుభవింపుచు కాలము గడుపుచుండెను.

మన వీరప్పయ్యగారట్లు శ్రీశైలము, చిదంబరము మొద
లైన పుణ్యక్షేత్రముల సేవించి యచ్చటి మహాత్ముల పరిచయ
మువల్ల నెన్నియో సంగతులు గ్రహించినవాడై వీరభద్రస్వా
మిగారి మహిమను గూడవిని వారివలనఁ దనకు గావలశిన
విద్యలభించునని యచ్చటకురాగా, నా గురుమూర్తి యాయన
యుదంతమంతయుగ్రహించినవాడై యాతడంతే వాసిగానుండు

టి కంగీకరించెను. అంతట గురుకుల వాస మొనర్పఁ బూనిన విద్యార్థియైన వీరప్పయ్య మొట్ట మొదటి రోజులలో, ఆశ్రమ మందలి యితర విద్యార్థులతో కలసిమెలసి యన్ని విషయము లందును తిరుగువాడు కాడట. అందుచేత వారంద అసూయావ శులై యాతని నొక గర్వపోతుఁగాఁ దలచి పరాభవముసేయ నాలోచన జేసిరి.

అదియొక వసంతకాలమందలి యసధ్యాయనదినము. ఆనాటి సాయంకాలము వీరభద్రాశ్రమ విద్యార్థులందఱునుకలసి సమీపమందలి కుంటేటిలో స్నానమాడుటకు బోయిరి. అందులో మన వీరప్పయ్యకూడ నుండెను. గురువుగారు రెండు వల్లనోగాని తరువాత వత్తుమని చెప్పియుండిరట. విద్యార్థులందఱు గుంపులు గాగూడి కులాసా కబుర్లు చెప్పుకొనుచు కుంటేటి నీటిలో దిగిరి. అట్లుదిగి లోతునకుబోయి మునుగుచు, తేలుచు యీదులాడు సందర్భములో నమాంతముగా నొకడు వీరప్పయ్య మీదబడి మరికొంత దూరము లాగుకొనిపోఁ జొచ్చెను. నిముషములో సమస్తమును గ్రహించిన వీరప్పయ్య వెంటనే యతని దప్పించుకుని మునిగి యదృశ్యుడయ్యెను. అంత వారందరునుతప్పుకొని పోయినాడురా! అనుకొనిరి. కొంతసేపటికివీరప్పయ్యనుగూర్చి యా నీటిలో వెదుకబూనిన విద్యార్థి సమాజమంనొక్కొక్క నివీపుపై యొక్కొక్క వీరప్ప వాహకుడుగా నెక్కి పిడిగ్రుద్దులు గ్రుద్దసాగెను. వారంద ఊరకే యఱవనారంభించిరి. కాని పైకి పాఱిపోవుదము అను, పరిజ్ఞానము ఒక్కనికిగూడ గలుగ లేదు. ఊరక చేపలవలె యా నీటి యందే తిరుగుచు నేద్చు

చుండిరి. వీపులమీద గ్రుద్దుల వర్షముమాత్రము కురియుచునే యుండెను.

ఇంతలో గురువుగారుకూడ స్నానార్థ మచ్చటకు విచ్చేసిరి. అప్పుడు సూర్యాస్తమయ మగుచుండెను. వీరప్ప నీటి యొడ్డున నొక యిసుక తిన్నెపైఁ గూర్చుని జపము జేసికొనుచుండెను. విద్యార్థుల గోల నీటిలోనుండి సన్నగా వినవచ్చుచుండెను. అప్పటికి తన జప క్రమము పూర్తియగుటచేత, నా వీరప్పయ్య గురుదేవుని జూచి లేచి నమస్కరించి యెదుట నిలిచియుండెను అప్పు డొక్కసారిగా, నీటిలో గోలపెట్టు విద్యార్థులు పైకి తేలి యఱచుచు గురుదేవుని జూచి 'స్వామీ! నమస్కారములు. వీరప్పయ్య మీఁదబడి గ్రుద్దుచు మమ్ము బాధించుచున్నాడు. రక్షించండి గురుదేవా! రక్షించండి' అని యేడ్వసాగిరి. గురువుగారి ముందర నిలుచుండిన వీరప్పయ్య వారి మాటలకు నవ్వసాగెను.

వీరభద్రస్వామిగారీ విచిత్ర స్థితికి నాశ్చర్యపడి యిది యంతయు వీరప్ప మహిమ యని గ్రహించి దీని కేదో కారణముండు నని తలంచినవాడై, అబ్బాయీ! ఇది యేమి? యని యడిగెను. వీరప్పయ్య వినయముతో తాము (విద్యార్థులు) యావన్మందియు కబుర్లు చెప్పుకొనుచు, స్నానార్థమునీట దిగుటయు. నీటిలో విలాసముగా నీదుచు నటునిటు తిరుగు నప్పుడొక వ్యక్తి తన మీఁదబడి, లోనికిఁ గొంపోవఁ జూచుటయు, ఇది యేదో మోసపు టాలోచన యని తలచి,యంతలో తాను తప్పించుకుని యీవలకు వచ్చినవాడై తన కర్తవ్యమును నెఱ

వేర్చుకొనుచుండుటయు, చెప్పియూరకుండెను. వీరభద్రస్వామి యిందు వారేదో తప్పుడు తలంపునకు లోనై, యేమో చేయ వలయునని నిశ్చయించుకొని నారని యూహించి, వీరప్పయ్య దైవాంశ సంభూతుడని యిదివఱకే తెలుసుకొనియున్నవాడు గావున, నా బాల బ్రహ్మమూర్తి ముఖారవిందముఁ దిలకించి, "నాయనా! వివేకహీను లగువారు దూరాలోచన లేక తొందర పడి యేపనినైన సాహసముతో నొనర్తురు. వా రుచితా నుచితములవంక జూడరు. లోక కల్యాణము నపేక్షించు సుజ్ఞా నమూర్తులైన భవాదృశులు, అట్టివారికి తగినట్లు బుద్ధిసెప్పుట మంచిదే. సుహృదయా! ఇకచాలును. క్షమించి వారల నీవలకు రమ్మనుము. అమాయికులగు వారి యుపాచరణము లంతగా గణింపదగినవి కావు" అని పల్కెను. అంత వీరప్పయ్య ఏమియు మాటాడక, దేశికుని యానతి మేరకు ఆ విద్యార్థుల నుపల క్షించి "సోదరులారా! ఇక రండి" యని పిలచెను. వెంటనే వారందఱు నంతలో తమ బాధలు పటాపంచలు కాగా, బిల బిలలాడుచు నీటినుండి యీవలకు వచ్చి గురువుగారి పాదముల వ్రాలిరి. పరాశయ గ్రహణశీలురైన యా గురువుగారు కోపిం చక అనాలోచిత కార్యము చేయరాదని వారిని మందలించి, వీరప్పగారి గొప్పఁదనమునుగూర్చి వివరించుచు, నాతని క్షమా భిక్ష వేడు డని యాజ్ఞాపించినవాడై తన కార్యములు తీర్చు కుని యాశ్రమము జేరెను. ఆ విద్యార్థులు గుర్వాజ్ఞ నెరవేర్చిన వారై, నాటినుండి, వీరప్పయ్యగారి యెడల నెంతయో గౌర వముతో మెలగసాగిరి.

ఈకధ పరుల యందసూయ నొందినవారికి భంగపాటు

ఆ॥ వె॥ ఎదటివాని భావ మేదో తెలియలేకఁ
గీడు సేయఁబూని కేవలమును
దామె భంగపడిరి తగు బుద్ధి లేమిచే
గురునివద్దఁ జదువుకొన్న నేమి?.



## 8. పశువుల గిరిగీచి నిలుపుట

పూర్వము వ్రేపల్లెలో శ్రీకృష్ణుడు నందుని గోవులను గాచిన విధముగా, బ్రహ్మముగారు బనగానిపల్లెలో, గరిమరెడ్డి యచ్చమ్మ గారి దగ్గఱ గోవులను గాయుట కుద్యోగించెను. గరిమరెడ్డి యచ్చమ్మ యను నామె 'రెడ్డిరాణి'యని పేరొందిన దగిన దొడ్డ యిల్లాలు. ఆ యూరిలోఁ జిన్న పెద్ద తగాదా ఏది వచ్చినను న్యాయముగా నిరుపక్షముల వారికినిఁ గొఱకొఱలు పుట్టని రీతిఁ దీర్మానము గావించి గ్రామ ప్రజల యందైక మత్యము చెడకుండ కాపాడునట్టి వివేకవంతురాలు. దయా హృదయ. ఆమెకు విశేషముగ పశుసంపద గలదు. మన వీరప్పయ్య వీరభద్రస్వామిగారిదగ్గర చదువుజాలించిన తర్వాత నీ యమ్మ దగ్గఱకువచ్చి తన యభీష్ట మెఱిగించినవాడై గోపా లకుడయ్యెను. అప్పుడాయన ఆ సమీప మందలి, రవ్వల కొండదాపున గల యడవిలో నొక సమ ప్రదేశమును జూచి, యక్కడ నొక గుండ్రని గీత గీచి, యందా పశువుల నిలిపి, తన పనిమీద నెచ్చటికో పోవుచుండువాడు. ఆ పశువులు

ఆయన యాజ్ఞను పాలించినట్లుగా, గీచిన గిరి దాటక, మేత మేసినట్లుగా, నెమరు వేయుచు హాయిగా నందే పండుకొని యుండునట. ఆయన సాయంకాలమునకు వచ్చి, వాటిని లేపి మరలించుకొని పోయి యచ్చమ్మగారి యాలకొట్టములోఁ గట్టి వేయుచుండువాడు. ఆ పశువులు ఆకలి దప్పుల బడుటగాని, అవయవయములు బక్క చిక్క పోవుటగాని, యెఱుగక చక్కగా కండబలిసి, చూడి, పాడి, యందములతో సుఖ జీవనము గడుపుచుండెను. ఈ సంగతులు కనిపెట్టి ఇది యేమిటో తెలుసుకొనవలెనని, యెవరైనా గిరి లోనికి వెళ్ళినచో, వారికి కన్నులు కనబడవు. వారి శరీరము లేదో యొక వింత యునికిలో నుండును. ఒక నాడొక పులివచ్చి యావు దూడ పైఁబడి దానిని చంపబోయి తానే యక్కడ బడి చచ్చెను. యీ వింత లన్నియు విని యచ్చమ్మగారు పరిశీలించుటకై బయలుదేరి వచ్చి యామె పూర్వ పుణ్యావశమున; యాగంటి కొండ గుహలోఁ దపస్సు చేయుచుండు నా మహాత్ముని దర్శించి యాయన వలన జ్ఞానోపదేశము నంది తరించెను.

అయితే శ్రీకృష్ణుడు గోవుల గాయుటలో, దుర్మార్గ బుద్ధితో, నపకారము సేయవచ్చిన మాయా వేషధారులగు విరోధుల(రాక్షసుల)నేకుల జంపుట గలిగినను అది యాయన యాదవ రాజగు నందుని కుమారుడుగాఁ బెరుగుచుండుట చేత వారి కులాచారము ననుసరించి యీ పని కుద్యోగించెను అని తేలుచున్నది. మన బ్రహ్మానుగారో, కులసంబంధము గాని, మతసంబంధము గాని, గ్రామసంబంధము గాని చివరకు కొద్ది

పాటి పరిచయము గాని లేనిస్థితిలో అచ్చమ్మ గారింటికివచ్చి యవ్యాజముగా నేను మీ పశువులగాచెదననిపల్కి యొప్పించి యా పనిచేయుటలో నేదో యర్థమున్నదని యూహింపవలసి యున్నది. దాని నీ విధముగా కొందరు చెప్పెదరు.

"పూర్వకాలములో శ్రీరామావతారము నందాయన కారణాంతరముగా నొకా నొకరోజున ఎండ గాడుపుల బడి యడవులలో దిరుగుచు దప్పిగొనినవాడై వడదెబ్బ తగిలి డస్సియున్న సమయములో భక్తురాలైన శబరియను కిరాతస్త్రీ కనబడి యాదరించి సమర్పించిన యెంగిలి రేగుబండ్లు తిని సేద దీరెను. అయితే అప్పుడామె చేసిన మర్యాదను మెచ్చుట తోడనే తన పనిమీదపోవుట గలిగెను. ఐతే శ్రీరామచంద్రు డానాడు పొందిన యుపకారమునకు ప్రత్యుపకారము చేయు టకు సమయము తటస్థించలేదు. అంతలో నాయవతారము చాలించుట గలిగెను. ఆ శబరియే యీవీరబ్రహ్మావతార కాల మునందు అచ్చమ్మగా పుట్టియుండుటచేత నా విషయమెఱిం గినవాడైన వీరప్పయ్య నాడు యెంగిలిపండ్లుతినిన పాతఋణము ఎత్తిపోవుట గలుగుటకును, ప్రస్తుతము తనకుఁ గావలసిన యోగసాధన జరుగుటకునై తగు యోగ్యస్థితి లభించుటకును తగినదిగా నుండునని యీపనిని కల్పించుకొనియెను."

కాని శ్రీకృష్ణులవారి పశుపాలనలో అనుచర సంరక్ష ణార్థమైన దావానలభక్షణము, కాళీయమర్దన మొదలైన వేవో యొకటి రెండు అలౌకిక ప్రభావములుకన్పట్టినను, మాయా రాక్షససంహారము తప్ప పైజెప్పబడినమాదిరి మహిమలే

వియు గనపడవు; ఆయన మాయారూపములతో వచ్చిన రాక్షసులను తెలుసుకొనేవాడు. ఈయన పరోక్షముగా నుండియు నెవరికో యపకారముసేయవచ్చిన దుష్టమృగమును ప్రతీకారమునందునట్లు చేసినాడు. ఏదియెట్లున్ననూ గుహాలలో తపోనిష్ఠ నుండుటకై గురుకులవాసము చేసివచ్చిన యాతడు కాలజ్ఞాన రచనాది యోగసాధనలకునై యీపని యొకకారణముగానుంచుకొని ప్రవర్తించినాడని తెలియుచున్నది.

ఈకథవలన బ్రహ్మముగారు పశుప్రాయులైన శుద్ధ మూర్ఖులను సైతము తన ప్రయత్నమువలన ఆజ్ఞాబద్ధులజేసి యుద్ధరించెననియును, తనను విమర్శించువారి కెఱుగరాని విధముగా నటించెననియును మనకుఁ దెలియుచున్నది.

సీ॥ గ్రంథస్థమైన యోగక్రియానీకమ్ము
స్థిరదీక్షసాధన జేయుటకును
గురుదత్త మహిత మంత్రరహస్యఫలము గ్ర
హించగ తపము గావించుటకును
ఘన తపశ్శక్తి నార్జనమొనర్చిన ప్రజ్ఞ
సద్ గ్రంధరచనమ్ము సల్పుటకును
అవసర దేహదార్ఢ్యముఁ బ్రసాదించు, నా
హారము సన్నిధిఁ జేరుటకును
అడ్డులేకుండు పనికి నా రెడ్డిరాణి
యండఁగోరి గోపాల న వ్యాజమునను
తన విధులఁ దీర్చుకొనఁ బర్వతస్థలమ్ము
జేరినాడా విరాడవతారమూర్తి.

★

## 9. సాహెబుగారి క్షమాపణ

వీరప్పయ్యగారు బనగానిపల్లెలో నచ్చమ్మగారి యింటి దగ్గరనుండు రోజులలో ప్రొద్దుపొడువకముందే లేచి యచ్చట నున్న జుర్రేటిలో స్నానముచేసి నుదుటిపై విభూతి నలంకరించుకొని సంధ్యావందనాదు లొనర్చుకొనివచ్చి పసుల తోలుకొని పోవువేళ యగువఱకును అచ్చమ్మగారి వీధియరుగుమీద కూర్చుని యేదో పుస్తకము చదువుకొనుచు కాలముగడుపుట వాడుకగానుండెను. ఆ రోజులలో నచ్చట హిందూ మహమ్మదీయ మతకలహములు చాలా ప్రబలముగా నుండినవట. హిందువుడైనవాడు తన మతప్రకారము, మొగమున బొట్టు పెట్టుకొని కనిపించినచో మహమ్మదీయు డెవ్వడును ఊరకుండడు. పైగా పరాభవించితీరును. ఆ స్థితిలో మన బాల బ్రహ్మముగారు బహిరంగముగా వీధియరుగుమీద విభూతి మొగమునిండఁ బూసుకుని కూర్చున్నప్పు డే మహమ్మదీయ మహాశయుఁ డూరకుండగలడు ? గ్రామవాసు లందరిచేతను గౌరవింపబడుచున్న యచ్చమ్మగారియందలి లక్ష్యముచేత నొకరిద్దరు పెద్దమనుష్యు లెవరో 'అబ్బాయీ ! ఆ మొగము మీద బూడిదనుతీసివేయుము. అట్లు చేయనిచో నది మహమ్మదీయ మతస్థులను పరాభవించినట్లగును' అని పల్కిరి. అయిన ధైర్యశాలియగు నాత డాతనిమాట నాలకించి తన గొప్ప దనము నొప్పరికించునా ?

ఆ ధీరోదారుఁ డెప్పటివలె కూర్చుని కాలక్షేపము సేయుచుండెను. ఒకనాడొక మహమ్మదీయుడు అసూయ

పట్టజాలక అరుగుమీఁద కూర్చుండిన వీరప్పయ్యగారిని సమీ పించి, నుదుటిపై చేయివైచి యా విభూతిని తుడిచివేయ జూచెను. శాంతముగా కూర్చుండిన వీరప్పయ్యగారి నొసలిపై సాహెబుగారి చేయి తాకగనే 'భగ్గు'మని యా విభూతి యంటె నంతమేర (ఆతనిహస్తము) అగ్గిమంట లెత్తసాగెను. ఆ బాధ కోర్వజాలక లబలబ లాడుచు మింగునంత కోపముతో వచ్చినసాహెబుగారు మెత్తబడి శాంతమూర్తిపహింపగా, ఆయన ముందు సాగిలబడి సలాముచేసి, దీనుడై తెలియక చేసిన తప్పును క్షమించి రక్షించుమని ప్రార్థింపజొచ్చెను. అంతట నా శాంతమూర్తి చిఱునగవుతో నాతని చేయిపట్టుకుని తుడు చుచు 'ఓయీ! యెన్నడును పరులయున్నతిని జూచి పగబూన కుము. నీ మతచిహ్నముపై నీకెంత విశ్వాసమో నా మత చిహ్నముపై నాకును అంత విశ్వాసముకలదు. రెండవవాని గౌరవించినప్పుడే మొదటివాని గౌరవముదక్కునని తెలుసు కొనుము. పరమతాన్ని దూషించినవాడు బాధలపాలగును' అని బుద్ధిసెప్పి ఇక వెళ్ళు మనెను. అతడంతలో చెయ్యి చల్ల బడఁగా సలాముపెట్టి తనదారిని బోయెను.

ఈ యుదంతము ఆతని నిగ్రహానుగ్రహ సామర్థ్యమును వెల్లడించుచున్నది.

చ॥ పరమతదూషణంబు తన పద్ధతికిన్ ఘనమిచ్చునంచుఁ బో
తరమున నన్యులన్ దెగడు తత్పరతంగనువాడు సత్య వి
స్ఫురణకతానఁదత్ఫలముఁ బొందకతీరదు భేదబుద్ధితోఁ
గరమటు బ్రహ్మబాలకుని గాంచిన సాహెబుగారిపోలికన్.



## 10. తాటిచెట్టు తనంతట వంగి ఆకులిచ్చుట

ఆలకాపరిగా తమదగ్గరనుండిన వీరప్పయ్య (బ్రహ్మం) గారిని గురించి ఆయన వింతచర్యలు అనగా పశువులను గిరిగీచి అందులో నిలుపుటయు, అవి యటునిటు పరుగెత్తక చెప్పి నట్లుగానే కదలక నెమరువేయుచు హాయిగా నందేయుండుటయు, మేత మేయకపోయినను కడుపునిండ మేసినవాటి మాదిరిగానే కండబలిసి కనబడుచుండుటయు, కాపలా మనిషి లేకుండా పశువులు కాలిదురదతీరునట్లు పరుగులెత్తిపోక నాచోటనే పండుకొనియుండుటయు, యీ చిత్రమేమిటో చూతమని యెవరైన నాగీచినగీతదాటి లోనికిపోయినచో వారికిఁ గన్నులుగానరాకుండుటయు, మొదలైన వెన్నియో విని విని యచ్చమ్మగా రాశ్చర్యపడినదై, యిందలి నిజ మేమిటో తెలుసుకొందమని భర్తగారితోగూడ నొకనాడు బయలుదేరి తమ పశువులున్న యడవికివచ్చెను. అట్లు వచ్చి పరిశీలింపగా వీరప్పయ్య జాడలేకుండుటచే అక్కడక్కడే తిరిగి ఎట్టకేలకు దంపతులు సమీపమందలి యాగంటికొండ గుహాలో తపస్సుచేయుచున్న యా మహాత్ముని చూడగలిగిరి.

అప్పుడాయన పద్మాసనము వేసుకుని బ్రహ్మాండ మండనమైన తేజస్సు గుహాయంతటను ప్రకాశింపగా ఐదు శిరస్సులుగల నాగేంద్రుడు పడగవిప్పి పైన గొడుగువలె పట్టియుండగా ప్రశాంత వదనముతో మౌనముద్రాంకితుడై కూర్చుండి తపస్సు చేసుకొనుచుండెను.

ఆ బ్రహ్మప్రకాశమును జూచి యా రెడ్డిదంపతులు భయ, భక్తి విశ్వాసములు ముప్పిరిగొని యావహించిన మనోనిశ్చయముతో దూరముననుండియే సాష్టాంగపడిఆయన కేవలము భగవంతుని యవతారమూర్తియని నమ్మి నమస్కరించి యక్కడనుండి వెడలజాలకయు. తమ యునికిలో నేమాత్రమయిన చప్పుడయినచో, నాయన తపోనిష్ట కెట్టి యాటంకము గలిగి యేమియనునో యని తలంచినవారై మెల్లగ నింటికి జేరిరి.

ఆ తరువాత మామూలు ప్రకారము సాయంకాలానికి పశువుల దోలుకొని యింటికివచ్చిన వీరప్పయ్యను వినయ విధేయతలొప్పఁ బలుకరించి, ప్రార్థించి, పూజించినమీదట వారంతటనుండియు పశువులగాయుటకై యడవికి వెళ్ళకుండ నొప్పించినవారై వారి యనుమతిమేరకా రెడ్డిదంపతులొక నేలమఠమును గట్టించి యాబ్రహ్మముగారందు తపస్సు చేసుకొనుచుండు లాగున నేర్పాట్లుగావించెను. (ఆ మఠ మీనాటికిగూడ బనగానిపల్లె యందుండు టందరకు దెలిసినదియే.)

వీరప్పయ్యగారంతటనుండి యా మఠములో నివసించి తపోనిష్ఠాదులొనర్చుకొనసాగిరి. ఆ సందర్భములో వారు ఉదయముననే లేచి సమీపమందలి జుర్రేటిలో స్నానము చేసి, సంధ్యావందనమగుటతోడనే ప్రక్కనున్న యడవివైపునకు వెళ్ళువారట. అప్పుడు అక్కడగల తాటిచెట్లు వాటియంతట నవియే వంగి నమస్కరించినట్లుగానై బ్రహ్మముగారికి ఆకు లందిచ్చుచుండునట. అట్లందిచ్చిన యాపత్రములుసంగ్రహించి

మఠమునకు వచ్చి గ్రంథమును వ్రాయుచుండువారట. ఇట్లు తాళవృక్షములు స్వయముగా పత్రములందించుట జూచియే "అన్నాజయ్య" అనువారు, వీరబ్రహ్మేంద్రస్వామి యచ్చట నుండెనని తెలుసుకొని యాయనను సమీపించి, సేవించి కాల జ్ఞానాది బోధలందెను. (ఈ యన్నాజయ్య జ్ఞానప్రబోధ మొనరించుటకై భూమియం దవతరించిన బ్రహ్మదేవుడు) ఇచ్చట తాటిచెట్లు పత్రములర్పించునట్లు చేయుశక్తిని వీరప్పయ్యగా రన్నాజయ్యకు ప్రసాదించి ఆయనద్వారా తాళపత్రములు తెప్పించుకొనుచుండినట్లును, ఆ సందర్భములోనే పులియొకటి యచ్చట మేయుచుండిన గోవుపై కురుకబోవుచుండగా చూచిన అన్నాజయ్య తందరగొని "హే గురూ! జీవహింస జరుగనున్నది రక్షింపు"మని కేకవేయగానే పులి పడిపోయినదే గాక ఆ గోవుకూడ పడి మరణించినట్లును, అదియే ఆతడు సిద్ధయ్యగా దూదేకులవారియింట పుట్టుటకు గారణమైనట్లును (కొందరు) చెప్పుదురు.

ఈ కథవలన బ్రహ్మముగారు జడపదార్థములకు గూడ చలనశక్తి నిచ్చి వాటిద్వారా ప్రయోజనము బొందినట్లు తెలియుచున్నది.

కం॥ ఈయన కాలజ్ఞానము
వ్రాయగఁ బనిబూనెనంచుఁ బత్రానీకం
బీయఁదగె, తాళవృక్షము
లాయదనన్ దలలువంచి యద్భుతలీలన్.



# 11. రెడ్డికుమారుని గ్రుడ్డితనాన్ని పోగొట్టుట

గరిమరెడ్డి యచ్చమ్మగారి కొక యంధుడైన కుమారుడు కలదు. అతని పేరు బ్రహ్మానందరెడ్డి. ఆతడు మంచి తెలివితేటలు గలవాడైనను గ్రుడ్డివాడైన కారణముచేత నన్ని వేళలయందును నింటనేయుండును. ప్రత్యక్షదైవమువలె తమ సన్నిధానమందే తిరుగుచు, మంచి చెడుగులఁ దెలుపుచుండు మహనీయుడైన వీరప్పయ్యగారి మానవాతీతములైన శక్తియుక్తుల నవలోకించుచుండుటచేత అచ్చమ్మగా రొకనాఁడా కుమారుని దీసుకునివచ్చి దైనికమైన తపోనిష్ఠతీరగా ప్రశాంతముతో కూర్చుండిన బ్రహ్మముగారి పాదములకు మ్రొక్కఁజేసి, యాయన దీవన వచనము లేవో పల్కి యాదరించిన మీఁదట తాను కరములు జోడించినదై 'స్వామీ! యీతడు నా యేకైక పుత్రుడు. యీ లోకమువంకఁ జూడజాలనివాడు. అనుగ్రహించి యీతని యంధత్వమును బాపి జన్మసాఫల్యము నందజేయఁ బ్రార్థించుదానను' అని వేడెను. అంతనా మహాత్ము డాతనిఁ జేరబిలిచి, నేత్రములు పరీక్షించి యామెతో "అమ్మా! ఈతడు దృష్టిభాగ్యము గలిగి బాగుపడగలడు. ఇతని యంధత్వ మిప్పుడే తొలగిపోవును" అని పలికి అబ్బాయీ! కన్నులు మూసికొనుము. అని యాతని శిరముపైఁ దన హస్తమునుంచి రెండు నిముసములాగి 'బిడ్డా! యికఁ గన్నులు తెరువుము' అనియెను. అంత నాతడు కన్నులు తెఱచి, యీ కనఁబడుచున్న భూమి, యాకాశము, చెట్టు పుట్ట పశువు, పక్షి, మున్నైన సమస్తమును చూడఁగలిగినవాడై

యత్యాశ్చర్య సంతోషములతో "నాహా! నేటికి నా జన్మ తరించినది" అని యా మహాత్ముని పాదములఁ బ్రాలి, ప్రార్థించి బ్రతికినంతకాలము బ్రహ్మముగారి పాదసేవతో మెలఁగెను. ఈ కథ గొప్పవారెంతటి యసాధ్యకార్యమైనఁ దన యోగ శక్తిచేఁ నవలీలఁ జేయఁ గలుగుదురని తెలుపుచున్నది.

పూర్వము శంకరాచార్యులవారు తమ తల్లిగారి కష్ట ముల వాపుటకై యిట్టి యోగశక్తిచేతనే యొక నదిని తమ యింటి ముంగిట ప్రవహించునట్లు రప్పించెను. మరియొకప్పుడు వారి గురువులైన గోవిందభగవత్పాదులు సమాధినిష్ఠలో నుండగా నదీప్రవాహము వచ్చిపడెను. అప్పుడు గురుని కాపా డుటకు ఆ నదిని తన కమండలములోనికి నాకర్షించెను. క్రీస్తు మహాశయుడు ముప్పదిఎనిమిది సంవత్సరాలపాటు కాళ్ళలో శక్తిలేమిచే లేచి నడువజాలని యొక మనుష్యుని పరుపు నెత్తు కుని నడచునట్లు చేసెను. నీరును ద్రాక్షారసముగా మార్చెను. ఇట్టివి చెప్పినను కూడ బ్రహ్మముగారిపైఁ దమకున్న భావభేదము నెల్లెన వెలిబుచ్చుటకుఁ జూచే మహాశయులు కొందఱు యిటువంటి యోగశక్తినే యీనాడుకూడ నెందరో బుద్ధిమం తులు మెస్మరిజమనే పేరుతో నభ్యసించి, యాశ్చర్యకరము లైన పనులనేకములుగా చేయుచునే యున్నారనియు నిందే మియు గొప్పఁదనము లేదనియుఁ బల్కుచున్నారు.

ఆ మెస్మరిజమనేది బ్రహ్మముగా రభ్యసించిన తప శ్శక్తి సంభావితమైన యోగవిద్యవంటిది గాదనియు, కారణ పురుషుడైన యా మహాత్మునకది స్వతస్సిద్ధముగాఁ గలిగిన

యలౌకిక ప్రభావమనియు విశ్వసించి, సమ్మోహనమని పేర్కొనబడిన యీయత్నిణీవిద్య ఇతరులయొక్క శక్తియుక్తుల నాకర్షించి వారి చైతన్యాదుల మార్పడఁ జేయుటకేగాని యొక సత్ఫలమును బ్రసాదించుటకెంతమాత్రము నుపయోగ పడజాలదనియు వారు గ్రహింతురుగాక! పూర్వము శ్రీకృష్ణ భగవానుడు పుట్టుగ్రుడ్డియైన ధృతరాష్ట్ర మహారాజునకు నాతని వేడికోలు ప్రకారము దృష్టిభాగ్యమును గలిగించి యున్నాడుగదా!

తే॥ గీ॥ అలవడిన యోగశక్తి నా యర్భకునిఁ గ
టాక్ష వీక్షణములజూచి యంతలోఁ బ్ర
శస్తమగు దృష్టిదయచేసె, నిస్తులమగు
నతని మహిమమ్ము నవ్వార లభినుతింప.



## 12. మాంసాహారము - పూలు పండ్లుగా మారుట

బనగానిపల్లెలో వీరప్పయ్యగారి ప్రభావము ప్రతివీధి యందును, ప్రతి యింటియందును, ప్రతివాని సంభాషణయం దును, పరిమళింపజొచ్చెను. అది క్రమ క్రమముగా నాయూరి నవాబుగారి దేవిడీలోనికిగూడ బ్రాకెను నవాబుగా రాశ్చర్య పడి, వెంటనే యొక యుద్యోగినిబంపి గౌరవముగా వారి నాహ్వానించెను. ఆ బ్రహ్మముగారును వారి యానతిమేరకా దివాణమునకురాగా, అవసరములైన మర్యాదలుచేసి, అంతరంగ శుద్ధితో నతివినయముగ మృదుమధురములైన వారివాక్యము

ద్వారా అనేకములయిన విషయములు తెలుసుకొని యానం దించెను. ఆ మరునాడుకూడా నట్లే యాహ్వానించినవాడై ఆ నవాబుగారు కుతంత్రవాదులు చెప్పిన మాటలపై తన సంశ యము దీరునట్లుగా వారి మహిమ నొకవిధముగా పరీక్షింప నెంచి తమ గోష్ఠియంతయుఁ బూర్తియైనపిదప నమస్కారము చేసి 'స్వామీ ! భోజనపువేళయైనది. సమయానికి సమీప మందున్న యతిథిని సత్కరింపనిచో మహాపాతకము సంభ వించుననని శాస్త్రములు చెప్పుచున్నవిగదా ? అంతర్యాణులగు తమకుఁ జెప్పునదేమున్నది ? యీనాడు మాయొక్క యాతి థ్యము నంగీకరించి మమ్ము ధన్యులఁజేయఁ బ్రార్థించు చున్నాము' అని పల్కెను. వీరబ్రహ్మముగారు చిఱునవ్వుతో 'వజీర్ జీ ! సంశయపడెదరేల ? అభ్యంతరము ఏమాత్రమును లేదు. మీ కోరికప్రకారము తప్పక మీవిందు నారగింతును. భోజనపదార్థము లిచ్చటికే తెప్పింపుడు' అనెను. అంత నవాబుగారును కొలదిమంది గౌరవోద్యోగులును బ్రహ్మము గారి పంక్తినిగూర్చుండగా అంతఃపురమునుండి మాంసాదు లతోఁ బక్వమైన పదార్థములతో నింపబడిన పళ్ళెరములు వారిమతాచారప్రకారమునన్ని వస్త్రముచే నాచ్ఛాదింపబడి దాసీలచేతఁ దెప్పింపఁబడియెను. అప్పుడు నవాబుగారు స్వయ ముగా నొకపళ్ళెమును చేతబట్టి బ్రహ్మముగారి ముందుంచిన వాడై 'స్వామీ! ఆరగింపు'డని సలాముచేసెను. అంత బరిచారి కలు తక్కినవారందఱకు బళ్ళెములు యథారీతి వడ్డింపగా వారు హుకుమ్‌జీ మహారాజ్! అనినంతనే వీరబ్రహ్మముగారు తన ముందరగల పళ్ళెమువంక జూచి; చిఱునగవుతోఁ దల

యాచినవాడై తన కమండలువు నందలి యుదకము గొని "ఓంభూర్భువస్సువః" అని ప్రోక్షించి పళ్ళెముపైనుండినయాచ్ఛాదన వస్త్రమును తొలగింపఁగా, నందలి పదార్థములన్నియుఁ బువ్వులుగాను, ఫలములుగాను మారినవై ఘుమఘుమలాడుచు నా ప్రదేశమునంతను పరిమళింపజేసెను. అంత నీ యద్భుతపరిణామమును జూచి, నవాబు మున్నగువారు భయసంభ్రమాకులహృదయులై స్వామివారి పాదములమీద వ్రాలి 'మహాత్మా! మా తప్పిదమును క్షమింపుము అఘటనఘటనా సమర్థమైన యాత్మశక్తిగల మీ భగవత్తత్త్వము నెఱుంగజాలక, మూఢులమై యపరాధమొనర్చితిమి. దైవస్వరూపా! దయాసింధూ! ఆశ్రితరక్షణాత్మకములయిన మీ కటాక్షవీక్షణముల మాపై బరపి పామరులమైన మమ్ముద్ధరింపుము' అని ప్రార్థించిరి.

పరుల మనస్సులెఱింగి ప్రతీకార మొనర్పకయే సున్నితముగా వారి భావములను మార్పగల బ్రహ్మముగారి ప్రభావము వర్ణనాతీతముగదా ?

చ॥ వలచి కుతంత్రవాదుల యవజ్ఞకరోక్తుల, నా వజీరు డు
జ్జ్వలమహిమాన్వితుండయిన సద్గురుమూర్తిఁబరీక్ష సేయనౌ
దలపునఁ జేసినాడు, మతధర్మనిషేధిత మర్మకార్య; మా
యలతిదనంబు చిత్రముగ నట్టిటులయ్యె మహాత్మసన్నిధిన్.

# 13. కాలజ్ఞానముఁగాపాడే చింతచెట్టు

వీరబ్రహ్మముగారు కొండగుహలోఁ దపస్సు చేయు చుండునప్పుడును, అచ్చమ్మగారు కట్టించిన భూమఠములో గాలక్షేపము, చేసినప్పుడును వారు కాలజ్ఞానము అను గ్రంథ మును వ్రాసిరట. అది ప్రపంచమున రానున్న విప్లవాదులను గుఱించి తెలియజేయు మహాగ్రంధము. ఆ గ్రంథమును వీరప్పయ్యగారు అన్నాజయ్య అను భక్తునకును, అచ్చమ్మ గారికిని కొంతభాగము వినిపించి యిది ప్రచారమునకు వచ్చు కాలమింకను చాల దూరముగా నున్నదని తెల్పినవాడై యా గ్రంథ మంతయు నచ్చమ్మగారి యింటిముందరనొక పాతరచే యించి, యందా గ్రంథపత్రములు భద్రపఱచి పైన అరుగు వేసి దానిపై నొక చింతమొక్క నాటెను. అది చూచి యచ్చమ్మగారు వింతపడి, నాయనా! ఇదియేమి? పవిత్ర మైన గ్రంథమంతయు పాతరలోనుంచి పైన చెట్టునాటితివి, దీనియర్థమేమి?యని యడిగెను. వీరప్పయ్యగారు అమ్మా! యీ గ్రంథ మింతలో నెవ్వరును చూడరాదు. ఎందుకంటే దేశమునందు ముందు ముందు చాల ఘోరములైన యుత్పా తములు సంభవింపనున్నవి. వేలకువేలు విపరీతములగు ననర్థ దాయకములు కలుగనున్నవి. వాటి సంఘటనలు దెలుపునట్టి యీ గ్రంథము నిప్పుడే ప్రజలు చదువగలిగినచో వారు భయకంపితులై తారుమారగుదురు. అట్టిది జరుగుట మంచిది కాదని తలచి యితరులు దీనిజోలికి పోకుండ నిట్లుచేసి యీ చెట్టు నాటితిని. యిది వందలకొలది సంవత్సరములు జీవిం

చియు క్రిందనున్న గ్రంథప్రభావమువలన మానవుల కుపయోగించు కాయలుకాయకుండును. కాని ప్రపంచమున కేదయిన యుత్పాతము సంభవింపనున్నప్పుడు తన యునికిద్వారా దానిని లోకమునకు దెలియజేయగలదు. అప్పుడు మేళతాళములతో భజనలుచేయుచు దానిని పూజించినచో లోకశాంతి గలుగును. యిది 'భగవదాదేశము' అని చెప్పెనట. వారు చెప్పినట్టులా చింతచెట్టు ఆనాటినుండి యీనాటివఱకు గూడ నుండినదై కాయలుగాయక ఒకవేళ కాచినను, పుచ్చి బూజు పట్టిన కాయలు రాల్చుచుండును. మఱియును దేశమం దేదైన కీడుగాని, పీడగాని కలుగనున్నప్పుడు ఆ చెట్టునకు ఒక ఎఱ్ఱని కణితివంటి బొబ్బపుట్టి, యది పగిలి, రక్తమువంటి ద్రవముగారునట. అప్పటి డచ్చటివారు (నేటికిగూడ) ఆ చింత చెట్టునకు ధూపదీప నైవేద్యాదులిచ్చి, భజనలు సేయుచు శాంతులు మున్నగునవి చేయుచుందురు. ఇది యీనాటికిని ప్రత్యక్షముగా జరుగుచున్న విషయము.

ఆ॥ వె॥ ముందువారి కేదో ముప్పుగలుగునన్న
పలుకు లిప్పుడిపుడె బైటవడుటఁ
గూడదనుచు నాడె గోప్యము జేసె, నా
గ్రంథరాజ మొరులు గాంచకుండ.



## 14. జుట్టేటిలో పుట్టె పగులకుండుట

బనగానిపల్లె యూరినానుకొనియే జుట్టేఱు కలదు. అనాదినుండియు నా యూర మృతినొందినవారికి దహనాది

క్రియలా యేటియందే జరుపుట యచ్చటి యాచారమై యుండెను. ఇది నిత్యస్నానాదు లొనర్చుకొనునట్టి యగ్రవర్ణ ములవారికిఁ గష్టతరముగా నున్నను పరిపాటిగా చాలకాలము నుండి జరుగుచున్న పద్ధతియగుటచే నెవ్వరును దాని నడ్డగింప కుండిరి. ఇట్లుండగా మన వీరప్పయ్యగారు అచ్చమ్మగారి యింటిదగ్గరనున్న రోజులలో నా యేఱు వారియింటికి దగ్గరగా నుండుటచేత వారుగూడ దానియందే స్నానసంధ్యాదు లొనర్చుకొనుట జరుగుచుండెను. కాని యీ పద్ధతి వారికిఁ గూడ సంకటముగానే యుండెను. అయిన నట్లు పీనుగుల కాల్చు పనికి యింకొకచోటు నేర్పరచుకొను డన్నచో నా గ్రామవాసు లొప్పుకొనరు గదా.

ఒకనాటి యుదయమున వీరప్పయ్యగారా యేటి యందలి యిసుకతిన్నెపై నాసీనులై యనుష్ఠానము జేసుకొను చుండెను. అప్పు డొకరిద్దరు మాదిగవాండ్రు కట్టెలమోపులతో వచ్చి 'యిచ్చట శవమును గాల్చెదరు, అందుకై యీ కట్టెల నిచట పేర్చవలయును. కావున లెమ్మనిరి. వీరప్పయ్యగారు నిష్ఠలోనుండి జవాబుచెప్పకుండుటచేతనావచ్చిన వాండ్లు వారి గొప్పదనమునుగూర్చి వినియున్నవారగుటచేత వారు లేచువఱకు వేచియుండు నుద్దేశ్యముతో నా కట్టెలచ్చటవైచి కూర్చుండిరి. తరువాతఁ గొంతసేపటికొక శవమును కొందఱు మోసుకువచ్చి దాని నచ్చటదింపి, కట్టెలపేర్చకుండ నిట్లేల కూర్చుంటిరని మాదిగ వాండ్లనుగద్దించిరి. వాండ్లులేచి భయవినయములతో 'మీరు నిర్ణయించినచోటునం దయ్య

గాను కూర్చుండి యోగనిష్ఠలో నుండుటచేత వారినిపల్కరింప జాలక నిట్లుంటిమని చెప్పిరి. అంతట వారా వీరప్పయ్యగారిని సమీపించుచు తీవ్రముగా 'ఏమయ్యోవ్! యింతమంది నీ కోసం యెంతసేపని కూసుంటారు? నీ జపం, తపం, అనుంటూ పోయి చేసుకోరాదు? లెగవయ్యా! లెగు?' అని కేకలు వేసిరి. వీరప్పయ్యగారు మెల్లగా కన్నులు దెఱచిచూచి, ఏమయ్యా యిచ్చట శవదహనం చేస్తే యికనుండి కపాల మోక్షము కలుగదని యీ నదీజాతకము చెప్పుచున్నదిగదా? అటువంటి యీ చోటుగాకపోతే యింకొక మంచిజాగా మరణించినవారికోస మేర్పఱచుకొనరాదా? యనెను. ఆమాట కావ్యక్తి యాగ్రహపడి "ఏమిటీ! యిద్దూరం, తాతముత్తాతల నాటినుంచి జరుగుచున్నదానికి భిన్నంగా యీయాల కపాల మోక్షమేకాదా? యెందుకౌదో చూదాం? అట్లాజరిగితే బడితెపెట్టి బాదియైనా పగలకొట్టి తీరుతాం గాని, వూరు కుంటామా?" అని యఱచెను. వీరప్పయ్యగారించుక నవ్వి "దేవునిశాసనం దెబ్బలకుపోదు; సగులని పుఱ్ఱెపై మీరెంత బలము నుపయోగించినా ప్రయోజనముండదు. అదిగాక యీ నీరు తగిలినచోఁ గాలిన యెముకకూడ కటికరాయిగా మారుతుంది", అని లేచి తనదారిని పోయెను. వారు ఆయనమాటను లక్ష్యపెట్టక నాశవము నచట నేదహనము చేసి కపాలమోక్షము గాకుండుటచేతవగచి కఱ్ఱలతో బాదిబాది ప్రయోజనముగానక విసిగివెళ్ళిపోయిరి. అప్పటినుండి యిప్పటివరకుఁగూడ నా జుట్టెటిలోని స్మశానమందలి తలపుఱ్ఱె లెన్ని గొడ్డళ్ళతో బాదినను పలుగులతో బొడిచినను పగులవట. మఱియు నందలి యెము

కలు సగము రాయిగాను, సగమెముకగాను యీనాటికిగూడ నుండునట. అమోఘవచనుండగు బ్రహ్మముగారి మాటకు తిరుగులేదుగదా ?

తే॥ గీ॥ సౌమనస్య తపోయోగసాధనములు
కలుగజేయును నిశితవాక్యప్రశస్తి
యది నిరంకుశకార్య ఫలాప్తిఁ దనరు
నాత్మశక్తికి నొకదోహదాంశనొసగి.



## 15. సర్కారు ఉద్యోగికి శాస్తి

వీరబ్రహ్మముగారు కందిమల్లయ్యపాళెమునఁ బ్రవేశించిన తర్వాత వారు ఉండుటకై గ్రామస్థు లభిమానించి యొక ఖాళీచోటు (పోరంబోక) చూచి యిల్లువేసి యిచ్చిరి. ఆయన యూరివారి కుపయోగించు వ్యవసాయపుఁ బనిముట్లు వగైరాలన్నియు తయారుచేసియిచ్చుచు సమయమున్నప్పుడు వేదాంత బోధలొనర్చుచు నట గొప్ప మర్యాదతో మెలగుచుండెను. ఇట్లుండగా నా యూరికరణము వీరి బోధలలో బ్రాహ్మణమత వ్యతిరేకములేవో యున్నవనే భావముతో యదార్థము నెఱుంగజాలక వారి గౌరవాదులపై నసూయ జెంది "యీయన అక్రమముగా గవర్నమెంటువారి భూమి నాక్రమించుకొని యనుభవించుచున్నా"డని పై యధికారికి దెలియపఱచి యీయనను రప్పించెను. ఆ యున్నతోద్యోగి యట్టహాసముతో వచ్చి, నేరము నిర్ధారణజేసి యీ యింటి

ప్రదేశమునంతను కొలతవేయించి, దానికి పన్ను కట్టవలసినదిగా నాజ్ఞాపించెను. బ్రహ్మముగారు శాంతముతో, నేను బీదవాడ ననియు ఊరి వారియభిమానంతో నిట్లుంటిననియు, పన్ను నీయ జాలననియు చెప్పెను. కాని యా యధికారి యవి యేమియు వినక దురాగ్రహముతో నేమేమో పల్కఁజొచ్చెను. ఆ సమ యమం దాకస్మికముగా నొక త్రాచుపాము పరుగుపరుగున వచ్చి యా యధికారిని కాటువేసి, యంతలో వెడలిపోయెను. అక్కడనున్నవారు హడలి యావలకు బరుగెత్తిరి. అధికారి స్పృహదప్పి పడిపోయెను. కరణము గాబరాపడి మందుల కోసమై, మంత్రగాళ్ళకోసమై భటులను పరుగెత్తించుచు తందరలాడుచుండెను. యీ విషయమునువిని వచ్చిన పౌరులు సంగతి నెఱింగి యిది వీరబ్రహ్మముగారి మహిమగాని వేరు గాదని సులభముగా గ్రహించినవారై, భయాకులితమైన హృదయముతో నేమిచేయుటకును తోచక ప్రతిమలాగు నిలచియున్న కరణమునుజూచి యాతని కుతంత్రమే యీ దుష్ఫలితానికిఁ గారణమని గ్రహించియున్నవారు కనుక నాతని బ్రహ్మముగారి పాదములమీఁదబడి ప్రార్థింపు మని పల్కిరి. ఆతడును తన తప్పు తా నెఱింగినవాడై 'గొప్పవారి జోలికిపోయినచో ముప్పువాటిల్లు'నను సామెత జ్ఞప్తికిదెచ్చు కొని, వెంటనే బ్రహ్మముగారి పాదములముఁదు సాష్టాంగపడి "స్వామీ! యిదియంతయు నాయపరాధము. మహాత్ములగు మీ మహిమ నెఱుంగజాలక మూఢుడనై, యే దుష్టగ్రహ మో కలుగజేసిన యపోహకు లోనై యీ యకృత్యముచేసి తిని. మీ కనేకనమస్కారము లొనర్తును. దాసుని తప్పు

దండముతో సరిగదా? దూరమునుండి వచ్చియే దురభిప్రాయ మును లేక తన యధికారధర్మముగ నేమో పల్కిన ఈ నిరప రాధిని బ్రతికించుడు. నా జీవనము నిల్పుడు. తప్పుచేయని యీతని దండించుట ధర్మముగాదుగదా! స్వామీ! సర్వజ్ఞ మూర్తులగు తమకుఁ జెప్పునదేమున్నది" అని వాపోవ జొచ్చెను. కరుణామయులగు బ్రహ్మముగా రాతని దీనా లాపములకు జాలిగొని, లేచి పడిపోయిన యీ యుద్యోగస్థుని సమీపించి, పాముకఱచినచోటున చేతితో రాయగా నాయన అబ్బా! యనుచు లేచికూర్చుండెను. అప్పుడు కరణము మొద లైన వారి మొగములు వికసించెను. దిగ్భ్రాంతుడైన యీ యధికారి యంతయు గ్రహించి తన యెదుటనున్న తేజోరాశి యగు బ్రహ్మముగారినిచూచి నమస్కరించినవాడై 'స్వామీ! శరణు; ఉద్యోగధర్మ మూతగానుండుటచే సదసద్వివేకము చాటునకుబోగా గర్వం కన్నులకుదట్టి తెలిసియుండియు మీ గొప్పదనమును కొంచెపఱచి మాట్లాడితిని. అందుకు తగిన శాస్తియైనది. మహాత్ములైన మీ యనుగ్రహమువల్లనే మరల జీవింపగలిగితిని. ధన్యవాదములు. నా యపరాధమును క్షమించి, మీ నిరంకుశప్రభావముతో దీనమానవకోటి నుద్ధ రింపుచు నేయడ్డులేక నిందేయుండి కీర్తిగాంచుడు' అని యధారీతి వెడలిపోయెను.

తే॥ గీ॥ అది పరోన్నతికోర్వమి నాచరించు
నట్టి పనియైన నెత్తిపై గొట్టగలదు
ధర్మదేవత; యుచితవిధాన మందు
చూడబడుగాక! ప్రజలుఁ మెచ్చుదురుగాక !

## 16. గ్రామదేవతచేత నిప్పుదెప్పించుట

కందిమల్లాయపాలెములో వీరబ్రహ్మముగారి వేదాంత బోధ లానందకారకములై ప్రజల నాకర్షించుచుండెను. ఆయన జాతి మతములు, చిన్న, పెద్ద, ఆడది, మగవాడు అను భేదమును పాటింపక నందఱకు విజ్ఞానముఁగలిగించుటయే ప్రధానముగాఁ దలచి, ప్రబోధమొనర్చుటలో నొక్కొకపుడు పేదవాని పూరిగుడిసెలోనికిగూడ ప్రవేశించి, వారి కేమియు నిష్టములేకున్నను 'అమ్మా! బోధచేసెదను. బాబూ! పరమార్థముఁ దెల్పెదను' అని యీవలకుఁ బిలిచి తన తీయనిమాటలతో, వారి నానందపఱచి వెళ్ళుచుండువాడు.

పూర్వము మతప్రవక్తయైన క్రీస్తుమహాశయుడుగూడ నిట్లే ప్రతిబీదవాని యింటికిని వెళ్ళి ప్రశాంతముగా దేవుని యందు భక్తి, పరిశుద్ధాత్మయొక్క గొప్పదనము; మంచినడవడిలోఁ గల లాభము చక్కగా బోధించి వారి మనోమాలిన్యమును బోగొట్టినవాడై మానవజీవితమందలి మాధుర్యముం దెలిపెడివాడట. బుద్ధభగవానుడు విద్యావినయసంపన్నులైన శ్రమణకుల (బౌద్ధసన్యాసుల) ద్వారా ప్రచారము సాగింపజేసి ప్రజలలో జీవకారుణ్యము విశ్వప్రేమ, పరోపకార బుద్ధి మున్నైనవి రేకెత్తుట కుపదేశింపజేసి విజ్ఞానవంతములైన వివేకవిశ్వాసములతోడి యానందోత్సాహములుదయింపజేయువాడట. ఏతాదృశమైన వీరబ్రహ్మముగారి ప్రబోధ ప్రవృత్తి కారణముచేత వివేకములేని సామాన్యజనులందరు పిచ్చివీరయ్య అని పిలువబూనిరి. హేళనగా మాట్లాడజొచ్చిరి.

త్రోవనపోవుచుండునప్పు డల్లరిపిల్లవాండ్రు బోధసేయుమని యఱచుచు గోలసేయసాగిరి. గంభీరమూర్తియైన యీ మహానుభావు డివియేవియు లెక్కచేయక వారి యవివేకము నకు నవ్వుకొనుచు బోవుచుండువాడు. అయినను వారా యల్లరిసేతలు మానకుండిరి.

ఇట్లుండగా నాయూర గ్రామదేవతకు జాతరచేయవలసి వచ్చెను. అమ్మవారి నూరిలోఁ బ్రవేశపెట్టినతర్వాత గ్రామ స్థులు వారి మామూలుప్రకారము ఇంటికొక వరహావంతున చందా వేసుకొని యీ .మహోత్సవము నిర్వహింపదలచిన వారై తమ నిర్ణయము ననుసరించి చందాధనము పోగుచేయ సాగిరి. ఆ సందర్భములో నొకనాడు గ్రామస్థులందఱును అమ్మవారిని నిల్పిన పూజామందిరముదగ్గర సమావేశమై చందాలు వసూలుచేయుచు నా వీరబ్రహ్మముగారి నటకు బిలిపించి మీవంతు చందాధనము నిమ్మనియడిగిరి. ఆయన వీరికీసమయమునఁ గొంచెము బుద్ధిసెప్పవలయునని యూహిం చినవాడై 'అయ్యా ! నేను మీ యభిమానమునందుకొని కాలముగడపు పేదవాఁడనుగదా ? నావద్ద చందాధన మెట్లుం డును? అయినను మీమీ జీవనవిధానముల కుపకరించు పరి కరములన్నియు చేసియిచ్చు నాకుఁగూడ చందా విధింతురా. అమ్మవారి సంబరము నా చందాధనములేకున్న జరుగదా ?' యని పల్కి వారి సమాధానమునకై యట కూర్చుండెను? రైతు లొకరిమొగము లొకరు చూచుకొనుచుండిరి. గ్రామ కరణము పుగాకుచుట్టజుట్టి కొస నోటబెట్టుకొని కాల్చుటకై

నిప్పుదెచ్చువారికొఱకు నటు నిటు చూచుచుండెను. వీర బ్రహ్మముగారది చూచి 'యేమయ్యా! కరణముగారూ! నిప్పు కావలెనా ? నేను దెప్పించి యిచ్చెదనుండుము' అని యచ్చటి పూజామందిరమందలి విగ్రహమును జూచి యందఱు విను నట్లుగా "ఏమే యూరిదేవతా ! కరణముగారికి చుట్టగాల్చు కొనుటకు నిప్పుగావలెనట. ఆ నైరాలులోనిది కొంచె మిటు తీసుకురా" అనెను. వెంటనే పురము (పూజాగృహము) లో నున్నదారు విగ్రహము మనుష్యస్త్రీవలెనై నిప్పుదీసుకునివచ్చి నిలబడెను. అదిచూచి భయభ్రాంతులై కరణం మొదలైన ఘరానా మనుష్యులందరును కాలికొలది పరుగెత్తసాగిరి. అప్పుడు బ్రహ్మముగారు వారిని చూచి చిఱునవ్వుతో 'ఏమ య్యా ! మీరెంతయో భక్తిశ్రద్ధలతో చేయు సంబరాలకు మెచ్చి మేలుసేయునట్టి యమ్మవారు కన్నులయెదుట సాక్షా త్కరించితే యిట్లు కంగారుపడిపోయెదరేల? రండు, భయము లేదు' అని యెంతచెప్పినను వారెంతసేపటికిని భయముతో దూరముగా నిలచి రాకుండుటచే నామెతో 'నేమే తల్లీ! యిక పొమ్ము. యిటువంటివివేకహీనులు బీదవాళ్ళను బక్కవాళ్ళను బాధించి పోగుచేసిన డబ్బుతో ప్రకటించు దుష్కలాపాదులకు భ్రమసి యిల్లెప్పుడును గ్రామాదులఁ బ్రవేశింపకుము' అని పల్కెను. ఆ నిముసమే యా దేవత మందిరములోనికి పోయి యెప్పటిరూపముఁ దాల్చెను.

అంత నా పరుగులెత్తిపోయినవారు వచ్చి బ్రహ్మము గారి పాదములమీదబడినవారై 'మహాత్మా ! మీ యద్భుత

మహిమను గ్రహింపజాలక మూఢులమై మిమ్మొక సామాన్య మానవునిగా దలచి, తప్పులు చేసితిమి. మా తెలివితక్కువ తనాన్ని మన్నించి మమ్మనుగ్రహింపవలెను' అని ప్రార్థించిరి. మఱియు నంతటినుండి యాయనను దమ గురువుగా నెంచుకుని గౌరవింపసాగిరి.

ఈవిధముగానే పూర్వము హరివ్యాసుడనే మహానీయుడు మధురానగర ప్రాంతమునందొక యమ్మవారి దేవళము దగ్గర జాతర జరుగుచుండగా నేదోపనిమీద నచ్చటకు వెళ్ళినవాడై, యట జరుగుచుండిన జంతుబలులు మున్నైన వాటిని జూచి యసహ్యించుకొని ఆ చూపట్టుచున్న దీనజంతువుల దుస్థితికి జాలిపడి దుఃఖించియు యేమియు చేయజాలక మనస్సు పట్టలేనిస్థితిలో నమ్మవారినిగూర్చి ప్రార్థనాపూర్వకముగ గాక ప్రౌఢభావ బోధకముగా ధిఃకరించినాడట. ఆ ధిఃకార్కారములో అప్పటి పరిస్థితులు అందువలన లోకమునకు గలిగే యపకారము దానిద్వారా తన దేవతాంశకు సంభవించే నీచస్థితి ఆ చేయుపనులలోని యసభ్యత, మొదలైనవి అగ్ని కణములవలె చెలరేగెనట. అంత నా యమ్మవారు ఆతని ధోరణికి నాగ్రహపడక శాంతమూర్తియై తనచోటునుండి కదలి ముందుకువచ్చి నిలిచి 'మహాశయా! యిదియొక యంశ సుమా? యీ తత్వము తెలుసుకొనక మాట్లాడుచున్నావు. అయినను నీ యీ ప్రబోధమువలన నిది యసభ్యమని గ్రహించితిని. యికనుండి నీ చెప్పినట్లుగా శాంతసౌహార్దములు బ్రకటింపుచు జంతుబలులు మున్నగునవి చేయకుండునట్లు యీ

ప్రజల భావముల నుద్ధరించి యహింసా సత్యసిద్ధాంతములను కల్గించి దేశమును కాపాడెద'నని చెప్పెనట.

ఈ వృత్తాంతమువలన బ్రహ్మముగారి కథలోగాని హరివ్యాసుని చరిత్రలోగాని యోగసిద్ధులు పొందిన మహనీయులు లోకాతీత వ్యవహారులైన దైవమూర్తులను గూడ చెప్పినట్లు చేయువారుగా నడిపింప సమర్థులై యుందురని తెలియుచున్నది.

ఆ॥ వె॥ ఎదటివానిఘనత నెఱుగంగజాలక
మొరటుమాటలాడు మూఢజనుల
మదులు మార్పడంగ మహనీయమగు తన
శక్తిఁజూపినాడు సాధుమూర్తి.



## 17. అమ్మవారి విగ్రహము నడచిపోవుట

గ్రామదేవతయైన అంకమ్మదేవరకు జాతర జేయు ప్రయత్నములో, కందిమల్లయ్యపల్లె పౌరులు శ్రీ వీరబ్రహ్మము గారికికూడ క్రమప్రకారము చందా వేసి, యాయన యూరి వారి పనులు నెరవేర్చు శిల్పాచార్యుడగుటచేఁ జందా ధనమునకు బదులుగా నమ్మవారిని నాగనంపు బండినిచేసి యిమ్మని కోరిరి. అమ్మవారి సంబరాలు అంకపొంకాలతో సాగుచుండెను. గ్రామవాసు లందరును అంకమ్మదేవర యానందపడుటకై, మహోత్సాహముతో ఆమెకు బలియిచ్చుటకుగాను, యింటికొక జంతువును సంపాదించి బాగుగా బలియునట్లు మేపిసిద్ధము

చేసియుండిరి. జాతరరోజులలో అమ్మవారి, పురము వాకిట హాతాన్మరణము నందబోవు గొఱ్ఱెలు, మేకలు,కోళ్ళు మున్నగు జంతువుల రోదన ధ్వనులతోడను, త్రాగి తందనాలాడు గణాచారులు మొదలైనవారి గావుకేకలతోడను పంబలవాండ్ల డప్పుడు, తప్పెటలు మున్నగు వాద్యముల యొక్క కఠిన ఘోషలతోడను, ఊరంతయు గొప్ప సందడితో నుప్పొంగు చుండెను.

అవసరార్థ మమ్మవారికి సమర్పించు నిత్య నైవేద్యాల పోరుతో ఆపదల మొక్కుల పేరుతో వందలకొలది కొబ్బరి కాయలు కోళ్లు మున్నగునవి యీయుత్సవదినాలలో నుసులులు గోలుపోయి కోరుకొన్నవారికేౕ గోరుకొనినంత మాంసాహార ములను లభింపచేయుచుండెను. అంత నమ్మవారిని సాగనంపు రోజు వచ్చెను. ఊరివారి బంధువులేకాక సంబరాలు చూచు వేడుకతో నాపరిసరగ్రామాలపాటకపు జనులుకూడ తండోప తండాలుగా విచ్చేసి యూరినంతను జనసమ్మర్దము గావించిరి. అమ్మవారి మందిరము ముందు పందిరిలోను, బైటను మెడలో వేపమండలు కట్టబడిన మేకలు మున్నగజంతువులు కట్టివేయ బడి కన్నుల నీరుగార్చుచు నేడ్చుచున్నట్లుచుచుండెను. గణాచారు లట్టహాసముతో వాద్యాల కనుగుణముగా వికృత నాట్యము లొనర్చుచుండిరి. సాగనంపు వేళ సమీపించుచుండెను.

అప్పుడు కాపు కరణము మున్నగు పెద్దమనుష్యులు బండికోసమై బ్రహ్మముగారింటికి కబురు చేసిరి వారేదోపని మీదనుండి రాక, జాగుచేసి యెట్టకేలకు పిలువగా పిలువగా

ఉత్తచేతులతో బయలు దేరి వచ్చిరి. అంత వారిని చూడగనే పెద్దకాపు మున్నైన పెత్తనదారులు కోపోద్దీపితులై బండి యెందుకు తీసుకురాలేదని గద్దించి యడిగిరి. ఆయన శాంతముతో బండిచేయుట కాలేదని చెప్పెను. అప్పుడా యజమానులందఱు ఆగ్రహపడి కార్యభంగము చేసినావనియు, అమ్మవారిని సాగనంపు టెట్లనియును పల్కుచు వారిని మిక్కిలిగా తూలనాడసాగిరి. బ్రహ్మముగారు వారిని నెమ్మదిగా శాంతింపమని చెప్పుచు "మీరెంతగా తీవరంపడినను అమ్మవారిని సాగనంపునుగూర్చియేగదా? ఆమాత్రపుబనికింతగా నాతురపడుట యెందులకు. ఆమెను బండిలేకుండగనే నడిచిపొమ్మందములే" యనెను. ఆమాటలకు వారు మరింత తీవరపడి, ఏమీ! నీకిదియంతయు నెగతాళిగానున్నదా? యేది! నడిచిపొమ్మనుము చూతాము. లేకపోతే నిన్నిక్కడ బలిపెట్టాము" అనిరి; ఆ బ్రహ్మముగారంతట గంభీరముగా మందిరములోని యమ్మవారి బొమ్మవంకజూచి ఓ యమ్మవారూ! యీ మూర్ఖుల సంతుష్టికోసమై నోరులేని జంతువుల రక్తమాంస లారగింపఁ మఱిగి కదలక యిచ్చట కూరుచున్నావా? లెమ్ము; బండి లేకున్నచో ప్రయాణమష్టుపడదులే పొమ్ము. తొందరగా" అని గద్దించెను.

అయితే అమ్మవారి విగ్రహముమాత్ర మేమీ కదలలేదు. అంత నా పెద్దమనుష్యు లొక్కసారిగా నవ్వుచు, సంగీతాలతో చింతకాయలు రాలగొట్టజూస్తున్నారు బ్రహ్మంగారు అని హేళనగా మాటాడసాగిరి. కాని బ్రహ్మంగారందుకు

తెల్లబోయి యూరకుండ లేదు. కొంచెము తీవ్రముతో దగ్గరకు బోయి యేమేముండా! కదలుట కిష్టములేదా ? నీవింత నీచు రాలవై పోతివేమి? కృపాశూన్యములైన యీజంతుహింసలు వాటిద్వారా హృదతావిదారములుగా చూపట్టుచున్న యీ దృశ్యములు నీకు చూడ నింపుగానుండెనా ? లోకమాతయని పేరొందిన నీవంటిదానికిది యొర్వదగిన దేనా ? మూఢులైన యీ ప్రజలకు జీవకారుణ్యము, న్యాయబుద్ధి, మంచిచెడుగుల తెలుసుకునే వివేకము కలిగించవలసిన నీవు అందుకు విరుద్ధ ముగా స్వార్థపరురాలవై జీవహింస జేయించుచు సిగ్గువిడచి యానందించుచున్నావా? ప్రశాంతము, ప్రేమ పరిమళింపదగిన యీ ప్రదేశమిట్లు దుర్గంధపూరితమై యసహ్యాకరముగ నుండ వలసినదేనా? నీవు దేవతవుగాదుసుమా ? ఏనాడు నీవు సాధు జంతువులఁ దినమరిగితివో ? ఆనాడే నీ దేవత్వము అంబికా త్వముగూడ అంతరించి పోయినవి. నీవు లోక కంటకురాల వైనావు. ఆలసింపక పొమ్ము. వెంటనేపొమ్ము అని పల్కెను.

ఈ మాటలతో నంత నా మందిరమందలి యమ్మవారి విగ్రహము గణగణలాడుచు పొలిమేర త్రోవబట్టి పోసాగెను. అప్పు డక్కడనున్న వారందఱును గుండె లదరిపోయి హాడలి పారిపోజొచ్చిరి. తరువాత జనమంతయు చెల్లాచెదరై వీగిపో సాగెను. గణాచార్లు కత్తులుపారవైచి కాలికొలదిపారిపోయిరి. కొంతసేపైన తర్వాత గుండెలు దిట్టపఱచికుని కాపు కరణము మొదలైన వారంఱువచ్చి బ్రహ్మముగారి పాదములమీదబడి

మా తప్పులు క్షమింపుమని ప్రార్థించిరి. బ్రహ్మముగారు పరిశాంతముతో నీతులు బోధించి నిలయము జేరిరి.

ఈ కథకూడ పై నుదహరించిన సందర్భములోనిదే. అయితే దీనివలన యోగసిద్ధిగల పురుషుడైన బ్రహ్మముగారు శిల్పము (దారుకారవృత్తి) కూడ చేయుచుండు వాడని మాత్రము తెలుచున్నది.

మ॥ తలపన్ దైవము పేరు తోడ్పడఁబరార్థత్వమ్మువోనాడి ప్రా
ణుల హింసించుట పాపకర్మమనియెంతో చాకచక్యంబుతోఁ
దెలుపంజాలెను వీరదేశికు పృథ్విన్ మూఢభావాల దు
ర్బలమున్ గన్నులదట్టజేసి, నిజమర్యాదన్ ప్రదర్శింపుచున్

## 18. కరుగుచున్న లోహద్రవమును ద్రాగుట

ప్రజలయందలి మూఢనమ్మకాలు మున్నెన్నవి యంతరించగల మూలజ్ఞానము. మాటనద్వారా చేతలద్వారా బోధించు పద్ధతులలో నసంభావ్యాలు, అపనమ్మకాలు తొలగిపోవుటకై బ్రహ్మముగారు ఒక్కొక్కప్పుడు శిష్యుల వెంట దీసుకుని సంచారముసేయు వాడుకకలదు. ఆ సందర్భములో నొకనాడు 'దిగుమెట్ట' అను గ్రామమునకు వెళ్ళుట కలిగెను. అప్పటికి కాలము మధ్యాహ్నము దాటి నడచుచుండెను. ఆ యూరియందొకచోట నొక కమ్మరపుబనివాడు కొలిమిలో నినుముపెట్టి కఱగుచుండెను. ఆ దగ్గర నొకరిద్దరు గూర్చుండి లోకాభిరామాయణముగా ఏసుక్రీస్తును గురించి

చెప్పుకొనుచు మతప్రవక్తయగు నాతడు సహృదయముతో నెంతయో ఆనందముగలిగించు సంగతులఁ బ్రకటించుటకై పరిచారము సేయువాడనియు ఆయన దర్శనమైనప్పు డొకానొకచోట జనులు భయకపింతులైకూడ నుండువారనియుఁ జెప్పుచుండిరి. అందుకు ప్రజలు పిచ్చివాళ్లై యుండుట చేత కొంతమంది యేవో పేర్లు పెట్టుకుని హోదాకోసము డబ్బుకోసము డంబాచారంగా బయలుదేరిరావడం పరిపాటియై పోయినదనియు అటువంటి బడాయికోర్లను జూచి భయపడుట యెందుకనియు అసలు వాళ్ళకాత్మశక్తియనేదే యుండదనియు నా కమ్మరాయన యేమేమో చెప్పుచుండెను.

ఆ సమయముననే మన బ్రహ్మంగారా చోటు సమీపించి యయ్యా! కొంచెము దాహమిప్పించెదరా! యని యడిగెను. అంత నా యయస్కార మహాశయుడు (కమ్మరి) వారినిజూచి కోపముతో మంచినీళ్ళు సరిగా దొరకక మాడిపోయే యీ రోజుల్లో నింతమందికి దాహ మెవరందిస్తారు. మీకేమీ మతిలేదా? పొండి ఊరిబైట బావిలోకి ఉరికితే తీరుతుంది దాహం" అని పల్కెను. అంత నా శిష్యులలో నొకడు అయ్యా! మాకందఱకు దాహంతోఁబని లేదు. వీరు మా గురుదేవులైన వీరబ్రంహ్మేంద్రస్వాములవారు మీ రెఱిగియేయుందురు. మీ కులపువారే గదా? ఏదో సంచార వశాత్తుగా నిట్లు వెళ్ళుచున్నారు. యీ మహాత్ముని దాహము దీర్చిన జాలును' అని పల్కెను. ఆ శిల్పాచార్యుడు కొలిమి సవరించుకుంటూ అంతా మహాత్ములే; వళ్లువంచి చాకిరీచేయ

డానికి వల్లగాక, నాలుగు ముక్కలేవో చెప్ప నేర్చుకొని యిట్లా బైలుదేరుతారు. పిచ్చిలో కొన్ని పీక్కుతినడానికి అయ్యగార్లంతా మహాత్ము లెందుకుగారు అని తల పైకెత్తి మహాత్ములైతే యీకొలిమిలో కరిగే యినుము నీళ్ళుగా నేయుంటుంది త్రాగమను చూదాం అయ్యగారిపస అనెను.

అంత నా గురుమూర్తి శాంతముతో నవ్వుచు నాయనా! నీకింత సందేహమెందుకు? నాపస నీవు ప్రజలు కూడ చూడవలసినదే! ఆ మూస నిటు తెమ్ము. నాయనా? సంతోషముగా త్రాగెదను, అని యాయగ్నికుండము (కొలిమి) సమీపించి యచ్చటనున్న కారుతో నందలి నిప్పుకణికలు తొలగించి మూస నెత్తి యా క్రాగిన యినుమునీరు గడగడ త్రాగసాగెను; అక్కడివారందరును తెల్లవోయి చూచుచుండిరి. అట్లు వీరగురుడా తప్తాయస్సలిలము (కాగినలోహజలము) త్రాగి, తన శిష్యులనుజూచి బిడ్డలారా! మీకు గావలయునా? యీ కొలిమిలో నింకొక మూస మనకొరకై నిలిచియున్నది. మీరు భయపడుచున్నారా? వలదు, మనము భయంకరములు, కష్టదాయకములు, అసాధ్యములు అని భావించినవి, మనకై భగవంతు డేర్పరచినవే. మనము మనోరంగములనుండి పరాఙ్ముఖత్వమును బాఱద్రోలినట్లయితే సర్వమును సానుకూలమేయగును, అని యాయనతో యయ్యా! ఆ మూస కూడ నిటు తెమ్ము, అనెను. అప్పుడా ధీరపురుషుడు శిల్పిగుండె పగిలి గడగడలాడుచు ముచ్చెమటలు పోయగా లేచి ముకుళిత హస్తుడై నిలిచి నోటి వెంట మాటరాక పాదములమీదబడి

స్వామీ! నాతప్పును క్షమింపుము. మీ గొప్పదనమెఱుంగ జాలక తప్పుగా మాట్లాడితిని. నన్ను రక్షింపుము అని ఏడ్వ సాగెను. బ్రహ్మగురుడు నవ్వుచు బుద్ధిమంతుడా! లెమ్ము, తెలియక చేసితివి, తెలిసి పరితపించితివి. అందు చేత నీవుచేసి నది యపకారము గానేరదు. నన్ను తెలుసుకున్నావు గనుక నా స్నేహితుడవైతివి. యిక నింపాదిపడుము. ఇతరుల నాద రించుపని మనమందరము నేర్చుకొనవలయును అయితే ఆ పని చక్కగా జేయుటగూడ నెంతో విధిగా నేర్చుకొనవలయును' అని క్రీస్తుమహాశయులు చెప్పియున్నాడుగదా? అది నేర్చు కొని సుఖముగా మనుము. అని తమదారిని వెళ్ళిరి.

ఇట్లె పూర్వము శంకరాచార్యుడుకూడ తానొకప్పుడు దాహశాంతికై తాటికల్లు ద్రాగగా, శిష్యులుచూచి మనము గురువుగారు చేసినపని మన మెందుకు చేయరాదని వారుకూడ కల్లుద్రాగుడు సాగించినారట. అప్పుడు వారికి బుద్ధిచెప్పుటకై యొకనాడొక శిల్పచార్యుడు వాగీశ్వరీకుండము (కుంపటి)లో కరుగుచుండెన లోహద్రవమును దాగినవాడై తన యోగశక్తి యందలి గొప్పదనము జూచి, వారిక సిగ్గుగలిగించెను.

అయితే నిది కేవలము స్వభావవిరుద్ధముగా నున్న పని యనియు నందుచే నమ్మదగినదిగా నుండలేదనియుఁ గొంద రంటున్నారు. బ్రహ్మముగా రెంతటి మహనీయుడైనను ఆయన రక్తమాంసాదులతో నిండిన భౌతికశరీరముతో సంచరించు వాడేకదా? పాదరసమువంటిదానిని భరింపజాలని యీ మానవశరీరము, కాగిన లోహద్రవమును కడుపులో నిముడ్చు

కొనజాలునా ? అసలు దాని స్పర్శను భరింపగలడా ? తప్త లోహమును ద్రాగుమనుటయు, ద్రాగెదననుటయు నసంభావ్యమేకదా ! యనుచున్నారు.

ఒకవేళ ఆయన యోగబలము వల్లగాని, యాత్మశక్తి వలనగాని యా శరీర మగ్నినిగ్రహదార్ఢ్యము నందినదనుకొన్నప్పుడు అది శాశ్వతపదార్థముగా నుండవలసినదేకదా? అట్టిది జరుగలేదే యనికూడ పల్కుచున్నారు.

బ్రహ్మముగారు కేవలము భగవంతుని యవతారమని నమ్ముచున్నాము. అయినచో నాయన చూపిన యద్భుత మహిమలే శక్తిచేత, నెట్లు నెల్లడి యయ్యెనో? విమర్శింప మన కేమి పని ? కాక వాని నెట్లూహింపగలము ? పురాణములలో నిట్టివి యనేకములున్నవి. మన పూర్వులు మహాపురుషులుగా నవతరించి వ్యవహరించినవారిని, అలౌకిక ప్రతిభావంతులుగా నిరూపించుటకై మహిమాంచితులజేసి మన్నించి వదలినారు. శ్రీకృష్ణుడు చిన్నతనమందే (పశుపాలన కాలములో) అడవిని దహింపబూనిన కార్చిచ్చునుమ్రింగి, గోపకులఁగాపాడినవాడు. ఏదో కారణముగాఁ దమలోఁ జేరిన కంసుని రాక్షసులు, చంపి, కాల్చి, బూడిదచేసి, యా బూడిదను పానకములోఁ గలిపి త్రాగించినను, ఆతని శరీరమును శుక్రాచార్యుని కడుపులో నుండి బైటపడెను. వాతాపి శరీరమును ముక్కలు ముక్కలుగా కోసి, కూరవండి యొకనిచేత దినిపించియుగూడ నిల్వల మహాశయు డాతని బిలచి యెప్పటి యాకారముజూచి యానందించువాడు, శ్రీరాముని భార్యయైన జానకీదేవి యగ్నికుండ

ములో దూకి, చెక్కు చెదరకుండా యథారూపముతో నీవ
లకు వచ్చెను. ఇవి యన్నియు స్వభావసిద్ధములా? వారి భౌతిక
శరీరము లిప్పటిదాక నుండినవా? అయినప్పటికి, బ్రహ్మము
గారు జీవసమాధిలో నిప్పటికిని తపస్సు చేయుచునే యున్నారు
గదా? వారి శరీరము శాశ్వతప్రకాశిత మొందుకుకాదు?

చ॥ అలవడినట్టి దృష్టి నుచితాను చితంబు లెఱుంగరాని, చే
తలఁ జెరలాడువాఁడు, తనతప్పు లెఱుంగుటకై యఁటాకి శాం
శలఁ జెరువారు మానసికశక్తి బయల్పడ నద్భుత క్రియా
విలసితమూర్తియై తనరె వీరగురూత్తముఁడా క్షణంబునన్



## 19. శిల్పనిర్మాణములో చాకచక్యము

శ్రీ వీరప్పయ్య (వీరబ్రహ్మము) గారు కందిమల్లయ్య
పాలెమున బ్రవేశించిన తర్వాత నోకనాడు ఎచ్చటకో వెళ్లుచు
'నుసుము' యనే యూరిమధ్యనుండి నడువసాగెను. అప్పు
డక్కడ కమ్మరపుఁ బని సేయుచున్న యొకరి కర్మశాల (పని
చావడి) లో నెక్కువ జనసమ్మర్దముగా నుండుట చూచిన
వాడై యదియేమిటో చూడవలెనని యచ్చటకు వెళ్లెను. అప్పు
డాకర్మకారుని (శిల్పాచార్యుని) యా ప్రజలు తమ తమపనులు
తయారుకాలేదని తొందరింపు చుండిరి. ఆయనపేరు నాగన్న
గారు ఆయన చాలా తొందరతోఁ బనిసేయుచు వారి యొత్తి
డికి తాళజాలని స్థితిలోనుండెను. పని తెమలుటలేదు. ఆవచ్చిన
యాసాములు (రైతులు) మాదిముందు చేసియిమ్ము మా పని
ముట్టు తొందరగా కావలెను, మాకు జాగుసేయడానికి వీలు

లేదు, అనుచు మిక్కిలిగా వేగిరింపఁ జొచ్చిరి. నాగన్నగారు వారికేమియు సమాధానం చెప్పజాలక, పనిచేత వలని భారము చేత, విసుగుతో నేమేమో యనుచుండెను, వారు వినుటలేదు. యీసమయములో నటకు వెళ్ళిన యువకుడైన బ్రహ్మముగా రంతయు గ్రహించి, యా శిల్పాచార్యుని సమీపించినవాడై చిఱునవ్వుతో ఆర్యా! తాము లేచి కొంచె మీవలకు వచ్చి కూర్చుండుడు. ఇంతలో నా చేతనైన సాయముచేసి, మీకుఁ గొంత విశ్రాంతి గలిగించెదను, అప్పుడు మీరీ రైతుసోదరులకు చక్కగా సమాధానము చెప్పఁగలుగుదురు. పెద్దవారగుటచే నలసటజెందియున్నారు. వేరుగా భావించక నావిన్నపమంగీకరింపుడు' అని పల్కెను. ఆయన తెల్లవోయి చూడసాగెను. రైతుల కా పలుకులెంతో యానందకరమునయ్యెను. మధుర మార్దవములైన యా మాటల కాయాసాములు తమ పనులు పూర్తియైనట్లె భావించినవారై వెంటనే నాగన్నగారి నుపలక్షించి వారందరొక్కసారిగా లెగవయ్యా! లెగు; కాస్త యిసుంటావచ్చి కూర్చో పాపం, పెద్దోడివి యేంతంటాలు పడతావులే ఆ కుఱ్ఱాయన యెవరో సాయంచేస్తానంటే సందేహం పడతావేల? అని పల్కిరి. అప్పుడాయన మనస్సులో నేమనుకొనెనో కాని మాటాడక వెంటనే లేచి యీవలకువచ్చి కూర్చుండెను. బ్రహ్మముగారు కొలిమియూదు వానిని హెచ్చరించి గంభీరముగా డాగలిదగ్గఱ కూర్చుండి మిక్కిలి చాకచక్యముతో, నాయా పనులు తయారుచేసి యీవల బడవైచుచుండెను ఆ స్థపతిచంద్రుడు (బ్రహ్మముగారు) పనిచేయుటయందలి ప్రావీణ్యములకు, చురుకుదనమునకు నా శిల్పా

చార్యుడే కాక యచ్చటి ప్రజలుకూడ మేర లేని యబ్బుర పాటుతో మేనులమఱచి దిగ్భ్రాంతులై చూచుచుండిరి. ఆయనచేతి సుత్తిదెబ్బ సోకినమాత్రముననే సుందర మూర్తిపడ, మంత్రించినైచినట్లుగా మనసంకల్పము మూర్తీభవించినట్లుగా సృష్టిచాతుర్యము స్పష్టీకరింపబడుటతో నా పరికరములద్భుత ముగా తయారగుచుండెను. పాతికజాము కాలములో పని యంతయు బూర్తిచేసి యా బ్రహ్మమూర్తి నవ్వుచు లేచి యీవలకువచ్చెను. అప్పుడాయూసాముల ఆనందాలకు ఆచా ర్యుని యాశ్చర్యానికి మేర లేకుండెను. రైతులెవరి పనిముట్లు వారు తీసుకుని యానందోత్సాహములతో నా క్రొత్త చిన్న వానిని మెచ్చుకొలుచు వెడలిపోయిరి.

శిల్ప విద్యావిశారదుడైన నాగన్నాచార్యుడు, ఆనంద పారవశ్యముతో నా బ్రహ్మమూర్తి నాలింగనము జేసుకుని నాయనా! యీనాడు నీ యీ రాక వలన నాగృహమును నేనును గూడ పావనుల మైతిమి. నాగౌరవమునకే కాక శిల్ప లక్ష్మి గౌరవానికిగూడ చిన్నెలు వన్నెలుకూర్చి శ్రేయస్సు నొసంగితివి; ఎయ్యూరు నాయనా! ఏపుణ్యదంపతులు నీకు తల్లి దండ్రులైన మహాభాగ్యమును కన్నారు. ఏ పవిత్ర నామము నిన్నుగాంచి వన్నెలందినది బాబూ? నీ యమృతవాక్కుల ద్వారా నాచీనులకు విందుగావింపుము. నా సుకృతమును పరి పక్వము నొనరింపుము, అనుచు లోనికి గొంపోయి, యొక తూసనమునైచి, యందు గూర్చుండజేసి నాయనా! శ్రమ జెందితివి, దాహము దీసుకొనుము, అని భార్యను పిలచి యొక

పాత్రలో పాలు చక్కెర కలిపి, దాహమునకై తీసుకురమ్మని యెను. అప్పుడామె పాకశాలలో మడిగట్టుకుని వంట జేయు చుండుటచేత నీవలకు రావీలుగాక ఆయన చెప్పినట్లు సిద్ధము చేసి కుమార్తెకిచ్చి పంపెను. అయమ్మాయి "నెన్నడ పొడవిన కన్నె మామిడిగున్న" యన్నట్లుగా 'జగతికి డిగ్గిన చంద్రలేఖ' వలె నందచందలతో నా 'మధుక్షీరపాత్ర' నుదీసుకొని వచ్చి నాటలేని సౌందర్యముతో బ్రహ్మతేజ ముట్టిపడ నటగూర్చుం డిన యతిథి కందించెను. ఆసుందరయువకు డమితానందముతో నాపవిత్ర కన్యారత్నముం జూచుచు పాత్రము నందుకుని యామె సున్నితపుజూపులఁ దన ప్రేమావలోకనముల నభినం దించెను, ఆమెయు నంతలో సిగ్గుపడి తుఱ్ఱున లోనికింబోయెను.

వీరబ్రహ్మముగారు క్షీరపానముసేయుచు నీయమ్మాయి మీ బిడ్డయా! అనియెను నాగన్నగారందుకు జవాబుగా నామె పెదకొమర్ల శివకోటయ్యాచార్యుని కుమార్తె యనియు ఆయనయు దానును మడ్డకులగుటచేత, వదినెబిడ్డయైన యీ యమ్మాయిని అప్పుడప్పుడు తీసుకువచ్చి ప్రేమతో బెంచు కొనుచుఁ గమకు బిడ్డలులేని కొఱతతో నానందపడుచుందు మనియుఁ దెల్పెను. ఆయన పాలుద్రాగుట ముగించినవాడై, పాత్రయటనుంచి 'మంచిది పోయివత్తును' అని లేచెను, అంతట నాగన్నగారదియేమి నాయనా! మాయింట నోకపూటయైన భుజింపకుండ వెళ్ళెదవా? యీవేళకుండు బాబూ నీకు నేనెట్లు కృతజ్ఞత సూపవలెనో; యెఱుగజాలకున్నాడను. యీమా త్రము నావభిలాభము దీర్చుమప్పా! అనియెను. అప్పుడు వీర

బ్రహ్మముగారి చూపులా యెదటి ప్రదేశమునకు బోయెను. అచ్చట సగంమాత్రమే చేయఁబడిన శిలావిగ్రహమొకటి కన పడు చుండెను. దానిని పరికించి, ఆచేయుచున్న విగ్రహమేమిటి అని యడిగెను, అందుకా యజమాని "అది వీరభద్రస్వామి విగ్రహము ఆల్లాటపల్లెవారు చేయించుచున్నారు. దానిని మాబంధువులలో నొకకుఱ్ఱవాడు చేయుచున్నాడు అయితే, అదియెన్ని సారులుగా, నెంతశ్రమపడి తీర్చినను ఆముఖ తేజస్సు సరిగా రాలేదని యాగ్రామస్థులనుచున్నారు, అంచేత నదిచే యుట నిలచిపోయినది. ప్రతిష్ఠాకాలము త్వరలో రానున్నదని యూరి వారు తొందర చేయిచునేయున్నారు" అనిచెప్పెను, అదివిని బ్రహ్మముగారు హెచ్చరికతో నేనుకూడఁ గొంచెము చేసి చూచెదను. మీకంగీకారమా? అనెను అందుకాయన అయ్యో నాయనా! అంతకంటె కలదా ? పాపమా కుఱ్ఱవాడు నానా శ్రమలఁ గుడుచుచున్నాడు, దయచేసిచూడు బాబూ! నీపుణ్యా ముంటుంది అని యక్కడకు తీసుకువెళ్లి దానిని చూపించెను. బ్రహ్మముగారు పరిశీలించి యిదిగాకా ఆ విడిగా నుండిన పెద్దశిలను నాకప్పగించుడు, మీకు స్వామివారి విగ్ర హమును చక్కగా తీర్చియిచ్చెదను, అనిపల్కెను ఆమాట లకు నాగన్న గారంగీకరించెను, బ్రహ్మముగారా శిలనొక గదిలో నుంచి యచ్చటఁదనకు గావలసిన పదార్థములు కూడ నుంచి తలుపు వేయవలయుననియు, నాలుగుదినములు గడచిన తర్వాతగాని యాద్వారబంధము తెరుపరాదనియు చెప్పి యొప్పించినవాడై యట్లుచేయించి, తానందుఁ బ్రవేశించెను.

నాగన్నగా రాయన చెప్పినట్లుగా తలుపువేసి యింటివారెవ్వ రును దానినితీయరాదని శాసించెను.

వరుసగా నాలుగు దినాలుగడచెను. అయితే ఆ గది లోనికి వెళ్లిన యువకశిల్పి పనిచేయుచున్నట్లు తెలిపెడి, యే చిఱుసవ్వడిగాని యెవ్వరికిని వినరాలేదు. ఐదవ నాఁడాయన యానతిచొప్పున నాగన్నగారు కాలకృత్యములు దీర్చుకుని యాగదితలుపులు దేరచెను. ఏమున్నది? ఆశ్చర్యము; సర్వాంగ సుందరమైన వీరభద్రస్వామివారి విగ్రహము మాత్రము మూర్తీభవించిన గురుస్వామివలె జీవకళ లుట్టిపడ యథారూప ముతో జూపట్టుచుండెను. బ్రహ్మముగారెటుపోయిరో గదా? యెవరు చూచిరి?

మ॥ సగుణోపాసకు లీప్సితాప్తికగు లక్ష్యంబందగా వీర భ
ద్రగురుస్వామి పవిత్రరూపమును బ్రత్యక్షంబు గావించె, స
త్వగుణ శ్రీసఖుఁడా మహాశయుడు; భక్తశ్రేణియర్చాదులం
దగుతచ్ఛిల్ప కలావిలాసము జగద్వంద్య ప్రభం గాంచగన్.



## 20. చచ్చినవాడు బ్రతుకుట

వీరబ్రహ్మముగారు వివాహము జేసుకొని గృహస్థాశ్ర మము నిర్వహించుటకు సంకల్పించినవాడై పెద్దకొమర్లయను గ్రామమునఁ దనకు తగిన కన్య యున్నదని తెలుసుకుని యొక మంచి రోజునఁ బ్రయాణమై, యాయూరునకు వెళ్ళెను. అట్లు వెళ్ళి యా కామన్న క్రొత్త బంధు గు లింటిలోఁ దనంతట

తానుగా ప్రవేశించుట కిష్టములేక గ్రామమందలి యీశ్వ రాలయమునకుఁ బోయి కర్తవ్యము నిర్ణయింప వచ్చునని యావైపునకు బోవసాగెను. అప్పుడు ఆయూరిలో నొక కాపు కుఱ్ఱవాడు రోగముచే జాలరోజులు తీసుకుని మరణించగా, నాతని శవమును పాడెపైకట్టి కొందమంది దానిని మోసుకొని యెదురుగా వచ్చుచుండిరి. అట్లు వచ్చుచున్న వారిని జూచి తల యూచి వారు దగ్గరకు రాగానే అయ్యలారా! ప్రాణమున్న వానిని పాడెపైకట్టి తీసుకువెళ్ళుచున్నా రేమి? అయ్యో! యీత డింకను బ్రతికి బాగుపడవలసిన వాడుగదా? యింతపొరపాటు పని చేసితి రేల? అనెను. వారిలో ముందున్న వ్యక్తి ఆయనను తేరి పారజూచి, అయ్యా! యీతడారు నెలలనుంచి రోగముచే బాధపడుచు నీరోజు ఉదయమే చనిపోయినాడు. ప్రాణముం డగా పాడెమీదబెట్టుటకు మేమేమి వెఱ్ఱివాండ్రమా? విరోధు లమా? మీరేపొరపాటుగ మాట్లాడుచున్నారు అనెను. అందు కా బ్రహ్మముగారు " నాకుఁ బొరపాటనునది లేదు. నిజమే పల్కితిని, అయినను ఆపాడెదించి కట్లువిప్పిచూడండి. మీకు నా పలుకులందలి పటిమ తెలియవస్తుంది" అనియెను. ఈ విప్పి కట్టుటవల్లనయ్యేజాగుకూడ యెందుకని, వారామాటల త్రోసి పుచ్చి 'యీ పిచ్చివీరయ్య ముచ్చట లెందుకయ్యా' యనుచు ముందుకు సాగిరి. బ్రహ్మముగారా మాటకు నవ్వుకొనుచు తనదారిని యీశ్వరాలయమువైపు నడచెను.

ఆశవవాహకులట్లు కొంతదూరము పోయి 'దింపుడు కల్లము' అనే పేరుతో, మధ్యమధ్య శవాన్ని దించి చూచే

యాచారము మేరకు నొకచోటఁ గా పాడెను దించినవారై బ్రహ్మముగారి పలుకులు చెవులలోఁ బ్రతిధ్వనించి చుండుట చేత నాపీనుగు మొగముపై గప్పిన వస్త్రమును కొంచెము తొలగించి, కట్టినకట్లను కొద్దిగా సడలించి, పరీక్షించి చూచేసరికి ఆతడు శ్వాసనాడించుచు. కనురెప్పలెత్తిచూచెను. అంత వారాశాపూరితులై కట్లన్నియువిప్పి యాతని లేవదీసి కూర్చుండబెట్టిరి. అతడు మెల్లగా దాహమని పల్కెను. వెంటనే యొకడు మంచినీరు తెచ్చి యీయగా దానిని త్రాగి యదివఱకు రోగియై నీరసముతో నుండినయతడు రవంత యలసట కూడ లేక పాడెనుండి లేచినిలచి ధృడముగా 'నన్నిట్లాతీసుకు వచ్చారెందుకు? పోదాం పదండ్రా' యనెను. అంతవారు పట్టరాని యానందముతో బ్రహ్మముగారి వాక్యములలోని సత్యమును, అందలి యమృతత్వమును, కొనియాడుచు, నాపాడెనట బారవైచి యందరును బయలుదేరి యాతని బ్రతికించిన యా మహాత్ముడెచ్చట నున్నాడో యరసి, వారిని సేవించి పోవుద మని, నిర్ణయించుకున్న వారై, తిన్నగా శివాలయమునకు వచ్చి యచ్చట ముఖమంటపములో గూర్చుండిన తేజశ్శాలియగు బ్రహ్మముగారిని గురితించి యాబ్రతికింనవానిని పాదముల ముందు బోరగిల దండజేసి యందరును చేతులుజోడించిన వారలై మహాప్రభూ! దైవమూర్తీ! శరణు! శరణు! నీ మహాప్రభావము చేతనే మా యీకుఱ్ఱవాడు బ్రతికెను; తెలివితక్కువవాళ్ళమై మీమాట నలక్ష్యముచేసితిమి, మాతప్పును క్షమించి మాకుఱ్ఱవానిని దీవించి పంపండి, అని ప్రార్థించిరి, బ్రహ్మముగారు ప్రశాంత వచనములతో నాయనలారా!

మీ రేమియు తప్పు చేయలేదు. అట్లనుట మానవసహజమైన పద్ధతియే; యిందు క్షమించున దేమున్నది ? యీ కుఱ్ఱవాడిం కను కొంతకాలము సుఖానుభవములంది వర్ధిల్లును, శుభమగు గాక ! ఇక మీరు మీ మీ యిండ్లకు బోయి యచ్చటివారి నానందింపఁజేయుడు, అని దీవించి పంపెను.

పూర్వము శంకరాచార్యులవారు కార్యాంతరమున హరిహర క్షేత్రము (ఇప్పటి నెల్లూరు, నెల్లూరులో హరిహర దేవాలయ ముండెననియు, నందుచే నదియే హరిహరక్షేత్ర మనియు చెప్పుదురు. బ్రహ్మముగారుకూడ చాలకాలము హరి హర పురమున సూర్యోపాసన చేసినా"రని చరిత్ర చెప్పు చున్నది) వెళ్ళినప్పుడు అక్కడ నొక బ్రాహ్మణ బాలుడు ఆక స్మికముగా మరణించెను. ఆతెడు, తల్లిదండ్రుల కొక్కడే పుత్రుడగుటచేత వారు మిక్కిలిగా విలపింపసాగిరి. అదిచూచి దయామయుడైన యా మహాత్ముడు జాలిగొని యా పిల్లవానిఁ బ్రతికించెను.

సుప్రసిద్ధ రామాయణ కర్తయైన తులసీదాసుగారు కూడ నిట్లె యొక చచ్చినవానిని బ్రతుకజేసెనట. కాశీనగర ములో నొకవర్తకుడు చనిపోగా, పౌరులెల్లరు నాతని మంచితన మునుగూర్చి ప్రశంసింపుచు స్మశానమునకుఁ గొనిపోవుచున్న యాతని శవమువెంట పోవుచుండిరి. అందులో బిగ్గరగా నేడ్చుచు నడచుచున్న యతని భార్యకూడ గలదు. అదిచూచి మహాత్ముడైన తులసీదాసుగారది యేమని యా గుంపులోకి వెళ్ళగా నా యేడ్చుచున్న స్త్రీ వారిపాదములమీదబడి యేడ్వ సాగెను. అంత నా మహాత్ముడు 'దీర్ఘసుమంలీభవ' యని

యామె నాశీర్వదించి యా శవము నింటికి రప్పించినవాడై, శ్రీరామ సంకీర్తనము చేసి యా బేహారిని జీవింపజేసెను.

అంతవరకు గుడిలోనుండి స్వామివారి కభిషేకాదులొనర్చుచున్న యర్చకుడిదియంతయుఁ దెలుసుకొన్నవాడై, తనపని ముగించుకుని యీవలకువచ్చి యట విశ్రమించియుండిన వీరబ్రహ్మముగారి వృత్తాంతము నంతయు తెలుసుకున్న తరువాత నాయన "అయ్యా! మాయింటి ప్రక్కనే శివకోటయ్యగారను శిల్పాచార్యుడున్నాడు, ఆయన చాలశిష్టాచారసంపన్నుడు, మంచివాడును, ఆయన యాతిథ్యమిచ్చి మిమ్మాదరింపగలడు, నేనుమీకుఁ బరిచయముచేయుదును రండు"అని వారియింటికి తీసుకుని వెళ్ళెను.

మ॥ తననిర్వ్యాజకృపావిలోకనములో దార్ఢ్యంబుజూపింప, వ
చ్చినవాడుం బలె, నట్లమోఘవచన శ్రీనర్తనం జేయఁ జ
చ్చినవానిం బ్రతికించి, వీరగురు డాశీర్వాదముంజేసెఁ ద
ద్ఘనశక్తిన్ బ్రజలుగ్గడింప, నిజతాత్పర్యంబు సిద్ధింపగన్.



## 20. సర్పదుష్టుడు సజీవుడగుట

ఇదిగూడా పైఁజెప్పిన వృత్తాంతము వంటిదే, అయితే కొంచెముగా భేదముండుటచేత చదువరులు దీనిని చర్విత చర్వణ న్యాయములో జమకట్టరనియు, అనేకాశయములతో నిండియుండిన బ్రహ్మముగారి ప్రభావము ప్రశంసనీయమనియు నమ్మిన విశ్వాసముచే, నిది యనుచితము కాఁజాలదని యుదహరింపుచున్నాడను.

ఒకప్పుడు బ్రహ్మముగారు మార్గవశాత్తుగా "మాధవరము అనే యూరికి వెళ్ళిరి. (అది దర్శి తాలూకాలో గలదట) గ్రామములో కాలుపెట్టి పదిగజాలు పరిక్రమింపగానే, యొక సందు మలుపునుండి, వారి కెదురుగాఁ గొంతమంది యొక శవమును మోసుకుని వచ్చుచుండిరి. వారివెనుకనే యొక వృద్ధురాలు గుండెలు బాదుకొనుచు పెద్దపెట్టున నేడ్చుచు వచ్చుచుండెను. ఆదృశ్యమును జూచి మన బ్రహ్మముగా రదియేమియని యా పరిసరాలవారి నడిగిరి, వారు యొక బీదకుఱ్ఱవాడు పాముగఱచి మరణించుటచే, నా శవమును దహింపజేయుటకై యట్లు పాడెగట్టి తీసుకువచ్చుచుండిరనియు, నా వెనుక నేడ్చుచు వచ్చుచుండిన ముసలమ్మ యాతని తల్లియనియు, పెద్దతనములో పెట్టిపోయువారు లేక అగచాట్లుపడుచుండు ఆమె యీనాటికెట్లో కష్టపడి యున్న గంజి మెతుకులు ప్రసాదించు యేక పుత్రుడు హఠాత్తుగా పాముగఱచి చచ్చిపోవుటచేత దుఃఖము పట్టజాలక యిట్లు పీనుగవెంటబడి యేడ్చుచు వచ్చుచుండెననియు చెప్పిరి. యింతలో నా శవవాహకులుగూడా సమీపించిరి. బ్రహ్మముగారు ఎదురుగా నిలచి రెండుచేతులు పైకి యెత్తి అయ్యా! కొంచెము నిలపండి, పాప మా బొట్టుగాడు గిట్టదగినవాడుకాదు. బ్రతికి బైటపడి పలువురఁ బోషించగల బలవంతుడు కావలెను. ఇది యాతనికొక గండమేమో? ఇది తప్పిన యెంతైనా మేలుగదా? అనుగ్రహించి యా పాడె నిట దించుడు; పాముకఱచినవానికి ప్రాణములు తొందరగాపోవు. అందువలన నాచేతనైన చికిత్స జేయుదును అని పల్కెను. వారు యిక్కడికే చాలాఆలస్యమైనది; యింకా యేమిబ్రతుకును

తాడు ? అనుచు ముందుకుఁబోవసాగిరి. రోదనము సేయు చున్న ముసలమ్మ ముందుకు వచ్చి యాయన పాదములపైఁబడి యేమేమో పల్కుచు నేడ్వసాగెను. దయార్ద్రహృదయుడైన బ్రహ్మముగారు మరల వారి నుపలక్షించి యయ్యలారా! దయచేసి రవంతసేపాగుడు, పాపమీదిక్కులేని ముసలవ్వదీనాలాపాలవినిన మీకు దయగలుగుటలేదా? మీకునుఁగూడజాలి గుండెలున్నవిగదా? ఎందుకంతగా తొందరపడుచున్నారు; ఆ పాడెను కిందికిదించండి, రెండునిమిషాలాగిన చాలు, దైవానుగ్రహమున్న సీతగు బ్రతికి తీరును, అనెను.

శవవాహకులు విసుగుకొనుచు పాముకరిచి ప్రాణంపోతే భగమంతుడో స్త్రీమాత్రం బతుకుతాడయ్యా! అని యొకడును యీయనమొగం చూడడానికి చచ్చినవాడుబతికి వస్తాడయ్యా! అనియొకడును, జరిగేది జరుగకుండా యీ దింపడం, యెత్తడం యెందుకొచ్చిన వుబలాటం, అని యింకొకడును, దారిమధ్యలో దించడం తప్పని మరియొకడును. పల్కసాగిరి. ఒక పెద్దమనిషి ముందుకువచ్చి, ఏందర్రా అట్లా అనుమానిస్తారు. ఆయవ్వ అదృష్టం బాగుంటె ఆడు బతుకుతాడేమో! ఉత్తమాటలుసెప్ప టానికి ఆకొత్తాయనకేంలాభం? దించండిరా! దించండి; అని గద్దించెను, ఆ ముసలామె, నాయనలారా! నాకొడుకు బతుకు నవియాశ గలుగుచున్నది కాస్తదించండి బాబులారా! మంచీ, చెడ్డా, విచారించకుండానే మాబాబుని మట్టిచేసి మనపనిమీద మనం పోదాం అని తొందరపడకండి తండ్రుల్లారా! అనుచు నెదుటనిలపడి యేడ్వసాగెను. వారు విధిలేక నా పాడెనట

దిగబెట్టిరి, బ్రహ్మముగారు దానిని సమీపించి, ఆ కప్పినబట్టం దొలగింపమని యా ప్రాణిలేని శరీరమును పరిశీలించినవాడై చేయిసాచి, శిరస్సునుండి పాదములవఱకు తడిచినట్లు జరిపి; యొకనిని బిలచి యాతని పేరుబెట్టి ముమ్మారు పిలువుమని చెప్పెను. ఆవ్యక్తి వెంటనే యా (శవము) చెవిదగ్గర నోరుపెట్టి యాతనిపేరుతో బిగ్గఱగా పిలిచెను. వెంటనే 'ఊ' యన్నధ్వని వినవచ్చెను అచ్చటనున్న వారెల్లరు నిశ్చేష్టులై చూడసాగిరి. మరల బ్రహ్మముగా రదేవిధంబుగా వానిని తాకి లెమ్మని పల్కెను. వెంటనే వాడు లేచి కూర్చుండి వింతగా చూడ సాగెను; అప్పుడాతల్లికి గలిగిన యానందమెంతయని చెప్పగలం

పురాణ యుగములో నొకానొకప్పుడు గరుత్మంతుని కాహారముగా నియమింపబడి చావసిద్ధముగా నుండిన నాగ యువకుని దుర్మరణాసక్తై వగచుచున్న యాతని వృద్ధజనని యొక్క మహాశోకమును చూడజాలక; ఉత్తమోత్తమ గుణ భాసితుడైన గంధర్వరాజైన జీమూతవాహనుడు; ఆ నాగ మాత దుఃఖనివారణసేయు సందర్భములో తన శరీరము నా గరుడున కాహారముగా నీయనుద్యమించి యాతని కాపాడెను. ఏకచక్రపురములో బకాసురున కాహారము కాబోవుచున్న బ్రాహ్మణ కుమారునికై దుఃఖించు వృద్ధమాత శోకమును బోగొట్టు సందర్భములో పాండవద్వితీయుడైన భీముడు మూఢ మైన. తన శరీరబలమును ధైర్యముతో నుపయోగించెను. బ్రహ్మముగారో, వివేక విస్తృతము, దైవకళా విలసితమునైన

యాత్మశక్తి నుపయోగించి యిట్టి మానవాతీతమైఁ గనపఱచి తన జీవదయాళుత్వము, యోగశక్తి, వెల్లడించెను.

మ॥ తనదైవాంశయు, యోగసిద్ధి, సుమహత్వశ్రీలదైవార, నా
యనముండా లమయానఁ జిత్రగతిఁ బ్రత్యక్షంబుగావించెఁ బా
వనమా కారుణిక స్వభావము, ప్రభావశ్రీకమైయుంటఁ జ
చ్చినవానిం బ్రతికించుచేత, మునువా సింగన్న క్రీస్తుంబలెన్.



## 21. చావు నటించినవాడు చచ్చుట

ఆనాడట్లు శివాలయార్చకుఁడు బ్రహ్మముగారిని వెంట నిడుకొని వెళ్ళి, శివకోటయ్యగారికిఁ బరిచయముఁ జేసెను. ఆయన ఆ చిన్నవాని గుణగణాదులకు మెచ్చి యద్భుతంపడి యాదరించెను. (యీఘట్టములో బ్రహ్మముగారొక తవిద యన్నపుమూట దీసుకుని వెళ్ళి, వారికందిచ్చినట్లును భోజనపు వేళ శివకోటయ్యగారి పంక్తిని గూర్చుండియుకూడ బ్రహ్మము గారు తన తవిద సంకటినే తప్ప యితరము భుజింపనని పట్టు బట్టినట్లును విధిలేక వారా చద్దియన్నపుమూటనే తెచ్చి యీయగా, నది యప్పుడే తయారు అయినట్లుగా ఘుమఘుమ లాడుచు, వేడియన్నము వలె చూపట్టి వారందఱాశ్చర్యపడు నట్లు చేసినదనియు చెప్పుదురు, అప్పుడు శివకోటయ్యగారి కుమార్తెయైన గోవిందమాంబ యా సుందరమూర్తిని చూచి యానాడు తన పినతల్లిగారి యింటికడ నత్యద్భుతంగా శిల్ప చాతుర్యం ప్రకటించి చెప్పకుండ వెళ్ళిపోయిన యువకుఁడీయనయే యని గ్రహించి తల్లిదండ్రులతోఁ జెప్పెను. బుద్ధిశాలు

రగువారు (శివకోటయ్యాయు నాయన భార్యయు) ఏమేమో మాట్లాడుకొని యీ యాగంతుక యువకమూర్తిని కొన్ని రోజులు తమ యింటివద్ద నుండునట్లుగా కోరి, నిలిపిరి.

పెదకొమర్ల గ్రామమునం దంతటను, శివకోటయ్యగారింటికి వచ్చిన చిన్నవాని ప్రభావము, నాబాలగోపాలము, ననేకవిధములుగాఁ జెప్పుకొనుచుండిరి. ఆయన చచ్చినవాని బ్రతికించుననియు, ఆయన ఏమాట పల్కిన నా మాటప్రకారము జరిగి తీరుననియు, ఆయన యేచిన్నమాట పల్కినను అమృతవాసన గుప్పుమని రేగి యీ ప్రదేశమునంతను ఆనందమయముగా జేయుననియు, నేమేమో వింతవింత ప్రసంగాలు వీధివీధిని, సందుసందున, యింటింటను, వెలయజొచ్చెను, ఆ చచ్చిబ్రతికినవానికి అంతవరకు మందులిచ్చి, చికిత్సలు చేయించిన వైద్యుఁడీ సంగతి యంతయు విని, యిదియంతయు తానిచ్చిన మందుయొక్క ప్రభావమేకాని, వేరు కాదనియు నీరసాధిక్యముచే సొలసియున్న రోగినిచూచి, యాలోచనలేక, తొందరపడి మరణించినాడని తలచి యట్లు స్మశానమునకు తీసుకుపోయిరేకాని యంతకుమున్నే మ్రింగిన యౌషధము బాగుగా జీర్ణాశయము జేరి రక్తనాళముల బట్టగనే, చలనశక్తి గలిగి యట్లు లేవదీసినదని చెప్పుచు తాను చేసిన చికిత్సల వలననే సేదదేరి బ్రతికినాడుగాని యింకొకటి గాదనియు, మాటల వలను; మంత్రాలవల్లను, మరణించినవా డేనాటికిని బ్రతుకజాలడనయు, గట్టిగా వాదింపజొచ్చెను. అంతటితో నూరుకొనక, నింతగా నూరియందంతటను వ్రాకిన యీ దుర్వాదము

నరికట్టినియెడల, తన గొప్పదనము తరిగిపోవుటకు గారణమగు నని యూహించినవాడై కొంచెము సేపాలోచించి తాను చెప్పిన పనులన్నియు తప్పక చేయునట్టి సాహసముగల గట్టివారి నొక రిద్దరను బిలచి యేదో రహస్యముగ చెప్పి పంపించెను.

ఆ మరునాడు పదిగంటల ప్రొద్దెక్కుసరికిఁ గొందరు మనుష్యులొక కుఱ్ఱవానిని, కన్నులుమూసికొని చచ్చినట్లు కదలకుండ పడియుండమని చెప్పి పాడెపై కట్టి మోసుకువచ్చి శివకోటయ్యగారి యింటిముందు దించి; దొంగవిచారము నభి నయించుచు, అయ్యా! దండాలు, మాకుఱ్ఱవాడు అకస్మాత్తుగ మరణించినాడండి, వీడుపోయిన మా కుటుంబమంతయు నాధా రము లేక అల్లాడిపోవునండి, స్వాములవారు దయచేసి యీతని చావునుంచి తప్పించి రక్షించాలండి; చచ్చినవానికి జీవము పోసి కాపాడే భగవంతునివంటి వారైన మీ పాదాలకు పది వేల నమస్కారాలండి, స్వామీ! మహానుభావా! మమ్ము రక్షించండి, అని భోరున నేడ్వసాగిరి; శివకోటయ్యగారీ సంఘ టనమును, నిశ్చేష్టుడై నిలచి చిత్రముగా చూడసాగెను. వీర బ్రహ్మముగా రప్పుడే భోజనము చేసినవాడై లోపల నుండి యీవలకువచ్చి చిఱునవ్వుతో, పాపము ఎంతో ఆదుర్దాపడి వచ్చినారు కాబోలు, ఏమి చేయుదము, వాడికర్మను వాఁడనుభ వించినాడు ఎవడు తీసుకొన్న గోతిలో వాడే పడుననే సామెత యూరికే పుట్టినదా. 'యాదృశీ భావనాయత్ర సిద్ధిర్భవతు తా దృశీ' అన్నారు పెద్దలు ఎవ్వడేభావముతో నటింపదలచునో ఆభావానికి సిద్ధింపక యూనదుగదా? చచ్చినవానిని బ్రతికించు

ఎవ్వరికిని సాధ్యమైనపనిగాదు? యీతడు నిజముగా చచ్చి పోయినాడు. పాపము ఘనీభవించి పైకొన్నస్థితిలో భగవంతుడుకూడ బాగుచేయజాలడు, నాయనలారా! యిక తీసుకుపొండు, లాభము లేదు" అని లోనికిపోయెను. శివకోటయ్యగారిందేదో చిత్రమున్నదని యూహించి, తలుపులు వేయుచు బాబులారా! కాల మతిక్రమించకుండ కాగల కార్య మేదో చూచుకొనండి, అని హెచ్చరించెను. వారు కథ అడ్డముతిరిగినదని చేసిన ప్రయత్నము చిన్నతనముదెచ్చినందుకు లోలోన వగచుచు నీవలకువచ్చి కట్లువిప్పి చూడగా, పాడెపై శయనించినవాడు ప్రాణాలువదలి బిఱ్ఱబిగిసి యుండెను. అంతటవారు లబలబలాడుచు, తాముచేసిన దుష్కార్యానికి తగిన ప్రాయశ్చిత్తమైనదిరా యని విచారించి క్రోధోద్రేకులై మనల నిట్లు చేయుమని ప్రేరేపించిన యీమందులమారి గాడిదపని పట్టించవలెనని నిర్ణయించుకున్నవారై, వెంటనే వానియింటికిపోయి, శవాన్ని వానిముందుపెట్టి, ఓరీ! తుచ్ఛుడా నీపన్నాగమువల్ల వీని ప్రాణాలు పోయినవి. దీనివలన మా కుటుంబమునకు తీరరాని యిక్కట్లు రానున్నవి. యిందుకు నీవేమిచెప్పెదవు, దీనికి సరియైన జవాబు చెప్పెదవా? లేక నిన్నుకూడ యీపాడెపై కట్టి కాటిమీదచేర్చి కాల్చుమన్నావా? అని తీంద్రించపసాగిరి. ఆ వైద్యుడీ గాలివాన దెబ్బకు తట్టుకొనుతెరవుగానక గడగడలాడుచు నిదేమిటిరా? యెత్తుగడ యెదురువచ్చినదని లోలోన విచారించుచు, వారిని శాంతించమని చెప్పి, వెంటబెట్టుకుని తిన్నగా వీరబ్రహ్మముగారున్న తావునకు వచ్చి, వారి పాదములపైబడి స్వామీ! అపరాధ మొనర్చితిని, మహాను

భావులగు మీ ప్రభావమును విని, యోర్వలేక దుష్టుడనై యే మేమో చేయనెంచితిని. నా యపకృతి నన్నే కట్టి కుడుపజూచి నది. నేను శిక్షార్హుడను, శరణుజొచ్చితిని నన్ను మీ బిడ్డగా నెంచుకొని నా తప్పును మన్నింపకున్న నీయల్పుని బ్రతుకునకు మార్గములేదు. పాపము భార్యతోడను బిడ్డలతోడను బహు కాలము జీవించవలసిన ఈకుఱ్ఱవాడీ యల్పుని దురాలోచనము వలన నిష్కారణముగ నీదుర్గతికి బాల్పడినాడు. ఇది నా సంసార పతనానికి బాటచేసినది. యీతని కుటుంబము నధోగతి నొందజేసినది. మహాత్మా దయచూడుము అమాయకుడగు నీతనిఁ గటాక్షించుటతో నీ దీనుని గాపాడనెంచుము అని యనేకవిధములఁ బ్రార్థించెను.

అప్పుడు వీరబ్రహ్మముగారాతని చెడుతలంపును గూర్చియు, దానిబలముతోఁజేసిన యీ సాహస కార్యమును గురించియును మిక్కిలిగా చివాట్లుపెట్టినవాడై, తన కుడి చేతితో నా శవాస్తదణముపై నున్నవాని శరీరమును తుడిచి యోయీ లెమ్మా! అనెను. అంతటవాడు దిగ్గునలేచి కూర్చుండి బ్రహ్మముగారినిచూచి కొంచెము సిగ్గుపడినవాడై వారికి సాష్టాంగ నమస్కారముచేసి, తన తప్పును మన్నింపమని వేడెను. ఆయన వానిని దీవించి లేవమనగా లేచినపిదప నందరుగూడ సంతోషపడినవారై, నమస్కరించి వారి మహిమను పొగడుచు వెళ్ళిపోయిరి. ఈకథవలన బ్రహ్మముగారి నిగ్రహానుగ్రహ సమర్థత వెల్లడియగుచున్నది.

తే. గీ. పరుని వంచింప బూనెడి పట్టునందు
నాత్మవంచనమే సిద్ధమౌనటంచుఁ
దెలియఁజెప్పెను, వాని దుష్కృతికి వాడె
ఫలమనుభవించుగాకని బ్రహ్మగురుఁడు.

## 22. అమ్మవారు వంటజేసి పెట్టుట

వీరబ్రహ్మముగారు వివాహము చేసుకుని, భార్యయైన గోవిందాంబతోఁ గూడ, కందిమల్లయ్య పాలెములో కాపురము సేయుచుండెను. ఒకనాడు మామగారైన శివకోటయ్యగారు కుమార్తె కాపురమెట్లున్నదోయని చూచుటకై వచ్చెను. ఆయనవచ్చిన సమయమున వీరబ్రహ్మము గారింటి వద్దలేరు. గోవిందాంబగారావచ్చిన తండ్రిగారిని చూచి మహాసంతోషముతో, పాదప్రక్షాళనమునకై చెంబుతో నుదకమును, తుడుచుకొనుటకై తుండుగుడ్డయునిచ్చి నవ్వు మోముతో నింటిదగ్గర తల్లిగారి సేమము, నిరుగుపొరుగు స్నేహితురాండ్ర సుఖాదులు మున్నైన కుశలప్రశ్నము లడిగి, సంతృప్తిని గలిగించే సమాధానము విన్నదై, యరుగుమీద మంచమువాల్చి దుప్పటిపరచి దిండువైచి నాయనా! కొంచెము విశ్రమింపుము మీయల్లుడుగారేదో పనిగలిగి యూరిలోనికి వెళ్ళినారు, రవంతసేపులో రాగలరు, అనెను. శివకోటయ్యగారు వీరబ్రహ్మముగారి సంసారము చాలనీరసస్థితిలో నున్నదనియు ఆయన యెప్పుడును అద్వైతబోధలతోడను, ఆశ్రిత గోష్ఠులతోడను, కాలము గడుపుచుండెనేకాని పట్టు

మని పనిచేసి పదికాసులార్జించినవేళ లేదనియు అదిగాక యితరులనడిగి కూడ యేమియు సంగ్రహింప జూడడనియు నందుచే నన్ను వస్త్రాలకుగూడ నంతంత మాత్రముగానే యున్నదదియు పలుసారులుగా వినియున్నవాడగుటచేత, నది యెంతవఱకు నిజమో తెలుసుకొన నెంచినవాడై, మంచము మీద కూర్చుని అమ్మా! నీ కాపురము సుఖవంతముగా నడచుచున్నదా? యనియెను. ఆమె నవ్వుచు నాయనా! అట్లను చుంటివేమి? లోకసామాన్యముగ కాపురమునకు కష్ట సుఖములు కావడికుండల వంటివి. అందురుగదా? ఆ విషయమై యంతగా నడుగుటెందులకు? అయినను నాసంసారము చక్కగా నడచుచున్నది, ఏమియు లోటులేదు, అనియెను. ఆయన గంభీరముగా మరేమియు లేదమ్మా! అడిగి తెలుసుకొని యానందించుటకై యట్లంటిని, అని దిండుపై కొఱగెను. అంతనామె బిందెతీసుకుని మంచినీళ్ళకై భావిదగ్గరకుఁ బోయెను.

ఆయన యనుమానముతీరక యీ మెమాట లెంతవరకు సత్యములో యెరుంగవలయునని లేచి యింటిలోనికి వెళ్ళి చూచెను. అలికి ముగ్గులువెట్టి అయ్యవార్లంగారి నట్టింన్నట్లు లా యిల్లంతయు పరిశుద్ధముగా కన్పట్టెను. వంటపాత్రలు వగైరాలన్నియు శుభ్రముగా తోమబడినవై వరుసగా పెట్టి యుండెను. బియ్యము మొదలైన సంబారము లేవియుఁ బేరునకుగూడ నెద్దానయందును చూపట్టలేదు. ఆయనయిట్లంతయు దెలుసుకుని, యీామె తనను సంతృప్తిపఱచుటకై యీావిధముగా పలికెనేగాని 'సర్వశూన్యం, నిరాలరుబం' అన్నట్లుగా

నున్ని యీ కాపురమందామె యెంతో కష్టపడుచున్నదని తలంచి నిట్టూర్చినవాడై "అయినను నిదానముగా సర్వము నెఱుంగవచ్చునని యీవలకువచ్చి యథాప్రకారముగా, పరుండెను. గోవిందమ్మగారు బిందెతో మంచినీరు తీసుకునివచ్చి "యింటిలోనుంచి, వంటగదివైపు జూడగా, నట సర్వాలంకార శోభితయైన యొక యువతి మడిగట్టుకుని వండచేయుచున్నట్లు లీలగా కనిపించెను. వివేకవంతురాలైన యామె యాదృశ్యము జగజ్జనని కటాక్షమని తలచి, నమస్కారముచేసినదై యీవలకు వచ్చి గంభీరముగా తంఢ్రిగారితో నేదో మాట్లాడుచు గూర్చుండెను.

మధ్యాహ్నమయ్యెను, అ యిల్లాలు యింటిలోనికివెళ్ళి మరలవచ్చి నాయనా! వేళయైనది, లేచిస్నానము చేయండి భోజనము చేయుదురుగాని, మీ అల్లుడుగారెప్పుడువత్తురో? ఆయన వచ్చునట్లైన నింత యాలస్యముచేయరు; మీరు లేవవచ్చును, అని యంగవస్త్రము నందిచ్చెను. ఆయన కిదియంతయు చిత్రముగా నుండెను, యింటిలో పొయ్యిరాజినట్లుగాని, వంట చేయఁబడినట్లుగాని లేదు, యింతవఱకీమె యిచ్చటనే యుండి మాట్లాడుచుండెను, యితరులెవ్వరు నింటలేరయ్యెను. ఇప్పుడీమె స్నానముచేయుమను చున్నది ఇదియెట్లు? సరే చూతమని. వెంటనేలేచ యంగవస్త్రమును గట్టుకొని అమ్మా! చెంబునిమ్ము. భావిదగ్గఱకుబోయి స్నానముచేసి వత్తును అనియెను. అందుకామె నాయనా! భావిదగ్గఱకు వెళ్ళనక్కఱలేదు బిందెతో నేడినీరు తొలిపి; పెరటిలోనుంచినాను అనియెను ఆయన పెరటిలోనికివెళ్ళి మసలకాగిన నీళ్ళతోనున్న

బిందెలో చేయిపెట్టి, చేయిసుఱ్ఱుమనగా నబ్బురపడి అమ్మాయీ! కొంచెము చల్లనినీరు కావలనని యడిగి. పోయించుకుని యిది యంతయు నగమ్యగోచరముగా నున్నదిరా యనుకొనుచు, స్నానము చేసి యుతికి యారవేసిన మడిపంచె గట్టుకొన్నవాడై భోజనశాలలోనికి వచ్చి యందు తనకై యమర్చిన పీటపై కూర్చుండి, వింతపడినహృదయముతో నెట్లొదైనికవిధి దీర్చు కొనబూనెను. యింతలో గోవిందమ్మగారాయనముందు విస్తరి వైచి పొగలుగ్రక్కు వేడివేడి పదార్థములు తెచ్చి వడ్డింప సాగెను. అన్నము, పప్పు, పులుసు, యిగురుకూర, పచ్చడి, అప్పడము, అన్నియు నప్పుడు తయారయినవే. వాటినిజూచిన శివకోటయ్యగారి యాశ్చర్యమునకు మేరలేకుండెను. ఆయన పరిషేచనముచేసి, ప్రాణాహుతులు వేసుకుని, చేతికి వేడిగా తగులుచున్న కూరలు కలుపగా గోవిందమాంబగా రప్పుడు వెన్నగాచినట్లుగా ఘుమఘుమలాడుచున్న నెయ్యి తెచ్చి వడ్డించెను; ఆయన మహాభ్రాంతిలో మగ్నుడై పోయెను. ఇదియే మైన కలయా? అనుకొనెను. చేతికి వేడితాకుచున్నది. నోటికి రుచి తగులుచున్నది, అమ్మా! యని పిలచిన నామె పలుకు చున్నది; అడిగినది తెచ్చియిచ్చుచున్నది; ఇది కలయెట్లు? ఇదియొక ఇంద్రజాలముగా నున్నది, ఆహా! యీ పదార్థము లెంత రుచిగానున్నవి? ఇట్టివి మున్నెప్పుడును తాను భుజించి యెఱుగడు. ఏమి యీమాయ; ఆయన తెలివితేటలీ సత్య మును గ్రహించుట కుపయోగించలేదు. యెట్లో భుజింప సాగెను. ఆ సమయమున వీరబ్రహ్మముగారు మున్నొకసారి రాగిసంకటిని పంచభక్ష్య పరమాన్నములుగా జేసి తమయెదుట

భుజించిన విషయము జ్ఞాపకమునకు వచ్చెను. ఆ! ఇది యంతయుగూడ నాతని మహామహిమయే, కాకున్న నింతటి యద్భుత సంఘటనము జరుగజాలదు; నేను చాల పొరపాటు పడితిని, కేవల మీశ్వరావతార స్వరూపు డీత డని భావించి యుండియు; మాయమోహితుడనై, ప్రజలమాటల విని భావ లక్ష్యమును కోలుపోతిని, యెంత తెలివితక్కు-తనము గలిగినది? అనుకొని తృప్తిగా భుజించి ఈవలకువచ్చి తాంబూలము నములుచుండగా వీరబ్రహ్మముగారు వచ్చి నవ్వుచు మాట్లాడిరి.

ఈకథలో నీ చరాచర ప్రపంచము సృష్టించి రక్షించుచున్న మాతృదేవతయైన యాదిశక్తి, బ్రహ్మముగారింటిలో లేనివేళ వారి సంసార (గార్హస్థ్య) బాధల నివారించుటకై లీలారూపిణియై యింటిలో ప్రవేశించి, వర్ణింపనలవిగాని రుచి విశేషాలు గల వంటకములు (పదార్థములు) కల్పించి యత్యద్భుతముగా (శ్రీ) గోవిందమాంబగారి ద్వారానే అతిథిసత్కారముఁ జేయించినదై వారి మహామహిమను వెల్లడింపఁజేసినది. ఇది వారి యవతార ప్రభావము. అథవా తపోబల విశేషము అని మనకుఁ దెలియుచున్నది.

ఇట్లె సుప్రసిద్ధుడైన కాళిదాస మహాకవి, కాలవశాత్తుగా పొరపాటున మాట్లాడినప్పుడు, ఆయన గౌరవము కాపాడుటకై యీ యమ్మవారే వజ్రముఖమైన తన కర్ణాభరణము (చెవికమ్మ) ద్వారా అమావాస్య చీకటిని, పున్నమ వెన్నెల గావించినది. భక్తశిఖామణియైన పోతనకవిరాజు, తన

కార్యమునందు అయోమయావస్థ నందినప్పుడు యీతల్లియే ప్రచ్ఛన్నరూపముతో విచ్చేసి, యాపనిచక్కజేసి యాశ్చర్యమును గలిగించినది.

దీనినిబట్టి మానవుడు శక్తిసంపన్నుడైనచో, నాతని జీవితమునం దవజ్ఞతయనునది యుండదనియు, ఒకానొక వేళ ప్రమాదవశాత్తుగా నేదేని సంభవమైనను భగవంతుడు దానిని సదతముఁ బరిహరించుననియు, తేలుచున్నది.

చ॥ తనకొక డా బుగ్గలనిక త్రాన, వివేకములేనివారుఁ గూ
ర్చిన మరియాదలో, నలతి చిన్నెలనెన్నిన బుద్ధిశాలికిఁ
మనసు పరిభ్రమింప, నతిమానుషదీప్తి వెలుంగజేసె, న
య్యనఘుడు, సర్వదా, కరతలామలకంబగు నాత్మశక్తిచే॥



## 23. నీటితో దీపము వెలిగించుట

బ్రహ్మముగారు అద్వైత వేదాంతము నన్నిచోటుల బ్రకటింపబూని తెలుగుదేశమున బ్రచారముచేసిన సందర్భమునొకతూరి హైదరాబాదునకు వెళ్ళెను. అప్పుడచ్చట నవాబుగారి దర్బారునందు గొప్పగొప్ప విషయాలు వివరించి, యాస్థానపండితులు, మతగురువులు, మున్నగువారికి ఆనందాశ్చర్యములు గలిగించి పూజింపఁబడిరి. నవాబుగారు; వారి ప్రబోధసామర్థ్యము, ప్రభావ బాహుళ్యము, మున్నగునవి తెలుసుకుని, వారికి శిష్యుడుగానై జన్మ తరింపజేసుకొనుట కుద్దేశించెను. అందుకై మరునాడు మరియొక సభ చేయుటకు

నిర్ణయించిరి. ఆరాత్రి యంతఃపురమందలి జిందాదిల్ మహాలు (ఆనందభవనము) లో, నవాబుగారు బేగముతో ముచ్చటిం పుచు బ్రహ్మముగారు మహాపండితులనియు, ఆయన తెలుగు వేదాంతములే కాక ఖురానులో నుండిన, గొప్పగొప్ప విష యాలు కూడ అనర్గళముగాఁ దెల్పినాడనియు చెప్పి, ఆయన తన తల్లిగారికి తారకమంత్ర ముపదేశించుట, విశ్వరూప ప్రద ర్శనము. మరణించినవారిని మరల ప్రాణముపోసి రక్షించుట, మున్నుగాగల లోకాతీతములైన వారి మహిమ లన్నియు చక్కగా వివరించినవాడై, ఆ మహానుభావుడు మానవులకు జ్ఞానబోధనచేసి వారిసితరింపజేయుటకై యీలోకమున బుట్టిన మహాత్ముడల్లాకాని, మరియొకడుగాడని తెలియుచుండుటచేత ఆయనవల్ల మనముకూడ జ్ఞానోపదేశముపొంది, అల్లాదర్శనము చేయుదమనెను. ఆమె యంతయు శ్రద్ధగావిని యానందించినదై భర్తగారి యభిప్రాయమునకు తన యంగీకారమును తెలియ జేసెను. ఆ తరువాత వారేవేవో విషయాలు మాట్లాడుకొని గురుదేవులైన బ్రహ్మముగారి మహిమ నొకదానిని మనము గూడ ప్రత్యక్షముగా చూచి, మంత్రోపదేశమును పొందుద మని తీర్మానించుకొనిరి. మరునాడు పాదుషాగారి దర్బారులో జరిగిన, పండితమహాజన సభలో బ్రహ్మముగారి వేదాంతోప న్యాసము బహుముఖములతో ప్రకాశిత మయ్యెను. అమృ తోపమానములైన వారివాక్కులద్వారా వెలువడిన యద్వైత భావప్రకటనలో, అస్పృశ్యతా నివారణము, అనేక మత మిథ్యాదృష్టి, సర్వమానవ సమానత్వము, చిన్నెలువన్నెలు దాల్చి చెలరేగి; మలయమారుతమువలె, మకరందవాసనవలె,

మధురమార్ధవ ధ్వనులతో, వెలుగులుజిమ్మ, మహాజనుల నానందపరవశుల జేసెను. అనంతరము పాదుషాగారు బ్రహ్మము గారికి సలాముచేసి, గురూజీ! తమరు కేవలము భగవంతుని యపరస్వరూపులు, యీలోకములో నెవ్వరును చేయచాలని ఖుదాయీ కార్యములెన్నియో చేసి, గొప్పపేరు నార్జించినారు; అనంతములు అద్భుతములునైన మీ మహిమల నాలకించుట కంటె యపరోక్షముగ సందర్శించి యానందించవలెనని యుబలాట పడుచున్న జనానావారి సంతృప్తిమేరకు, యీవిధేయుని కోరిక దీర్ప వేడుచున్నాడను అని పల్కెను. బ్రహ్మముగారు చిఱునవ్వుతో వజీర్జీ! సంశయింపక నీయభిలాషము నెరిగింపుము. దైవధర్మమైన ప్రజాపాలనము చేయుచు సర్వసమదృష్టితో, ప్రభుత్వాంశగొన్ననీవు దైవస్వరూపుడవు, అట్టి నీ కోరిక దీర్చుట మావంటివారికి విధి; కావున నెఱిగింపుము. అది యీసమయమందే తీరగలదు అనెను. నవాబుగారానందముతో చేతులుజోడించి స్వామీ! మరేదియుగాదు, ఈనీటితో దీపము వెలిగించి చూపవలెను, అని విన్నవించెను. గురుమూర్తి ఈమాత్రపుబని కింతచెప్పవలయునా అని నవాబుతో జనానా వారువచ్చి చూచుటకై యిచ్చటనొక తెరగట్టించి మీ యిష్టమువచ్చిన ప్రమిదయు నొక చెంబుతో నీటను దెప్పించ మనియెను అంత కొంతసేపటికి బేగముగారు మొదలైన ఘోషాస్త్రీలు వచ్చి తఖ్తువెనుక తెరచాటునుండి చూచుచుండగా బ్రహ్మముగారు పాదుషా తెప్పించిన ప్రమిదలో నీరు పోసి, చకుముకిరాయి గొట్టి యగ్గిచేసి యా నీటిప్రమిదలో దీపము వెలిగించెను. అప్పుడందరును జయజయధ్వనులతో

కరతాళములువైచి బ్రహ్మముగారి ప్రభావమును వేనోళ్ళఁ గొనియాడిరి. ఆ పిమ్మట, పాదుషా, పండితులు బ్రహ్మముగారికి శిష్యులై జన్మసాఫల్యము నందిరి.

తే. గీ. మహిత, యఘటన ఘటనా సమర్థమైన
యోగశక్తిచే; వెలిగించె నుదకమందు
దీప, మత్యద్భుతంబైన దీప్తి వెలగ
ఆగురుస్వామి! వారెల్ల రబ్రమంద॥



## 24. కుష్ఠురోగిని కాపాడుట

గురుదేవులైన యల్లాటపల్లె వీరభద్రస్వామివారి యారాధన మహోత్సవమునకై శ్రీ వీరబ్రహ్మముగారును, స్నేహితుడైన లింగావధూతయు కలిసివెళ్లుచుండిరి. అదియొక యెడారిమార్గము. ఆ ప్రదేశమం దక్కడక్కడ చిన్న చిన్న పొదలు, రాళ్ళగుట్టలు తప్ప, యొకవృక్షముగాని సేద్యమునకై యున్నిన భూభాగముగాని కన్పడదు, మార్గము మాత్రము తీర్చిదిద్దినట్లు తిన్నగా జనులయొక్కయు బండ్లయొక్కయు, రాకపోకలవలన బాగుగా నలిగినదై, యెగుడుదిగుడులు చూపట్టక రోడ్డుమాదిరిగా తోచుచుండెను. ఆ మార్గమునుండి మన బాటసారులు (బ్రహ్మముగారు, లింగావధూత) ఆమాట యీమాట చెప్పుకొనుచు నడచుచుండిరి. అట్లు పోగాపోగా, నా యెడారి నడుమ నెట్టయెదుట బాటకు ప్రక్కగా మంటపమువలె నుండినయొక రాతిమిద్దె కనుపించెను. అది బాటసారుల విశ్రాంతికొర కేర్పడినదియే. అచ్చట మంచినీరుండిన

యొక దిగుడుభావిగూడ కలదు; దానిని సమీపించగనే లింగావధూత బ్రహ్మముగారితో స్వామీ! యీమందిరమున కొంచెము విశ్రమించి పోవుదమా? యిచ్చట భావికూడకలదు ఇందులో దిగి కాలుసేతులు శుభ్రపఱచుకొని, దాహము దీర్చుకొనవచ్చును. అనినంతనే బ్రహ్మముగారు సరేయనగా వారిరువురు నా భావిమెట్లనుండిలోనకిదిగి యందలి నీటిచేఁ గర పాదములు కడుగుకుని దాహముదీర్చుకుని, కమండలమునిండ జలము నింపుకుని యీవలకువచ్చి యామందిరముఁ బ్రవేశించిరి. ఆ సమంటపమం దక్కడ నొక స్త్రీయు కుష్టురోగము గల యొక పురుషుడు నుండిరి. ఆతడు శరీరమున బట్ట గప్పబడిన వాడై, కన్నులు మూసికొని పడుకొని యుండెను. ఆమె విచారముతో నాతనిదగ్గర కూర్చుని చీరచెరగుతో విసరుచుండెను. ఆ దృశ్యమునుచూచి వారు నిలవబడిరి. ఆమె వారిని చూచి వెంటనే లేచి నిలచినదై, చేతులు జోడించి అయ్యా! తామెవరో మహాత్ములుగా నున్నారు; మేమొక యభాగ్యదంపతులము యీ నా భర్తగారు చాలరోజులనుంచి కుష్టువ్యాధిచే బాధపడుచున్నారు. ఎన్ని శ్రమలబడినను రోగ నివారణము కాలేదు. ఊరిలోనివారు మీరిచట నుండరాదని దయాదాక్షిణ్యములు వదలి మమ్ము బయటకు వెడలదరిమినారు. దైవకృప యిట్లున్నదని మాకర్మగతికి శోకించుచు ఉండుటకూరు, నిలచుటకు నీడ గానక, కనికరించువారు లేక కాందిశీకులమై, యేదో తెలియరాని యాశ ముందుకు నెట్టుచుండగా, ఏమహానుభావుడైన దర్శనమిచ్చి కాపాడడాయని, యిట్లడవులబట్టి తిరుగుచున్నారము. అయ్యలారా! నేడీయన మూర్ఛపోయినాడు,

ఏమిచేయుటకును తెలియకున్న దానను. దిక్కులేని దీనులమగు మమ్ము రక్షింపవచ్చిన దైవమూర్తులవలె మీరు దర్శనమిచ్చి నారు. అనాథులమైన మమ్మనుగ్రహించండి తండ్రులారా! యీ దీనురాలి విలాపములాలకించండి అని పొంగివచ్చు దుః ఖాతిశయముచే బ్రహ్మముగారి పాదములపై వాలెను. వారు పరిశాంతముగా తలయూచి, అమ్మా! లెమ్ము, నీ భర్తకే మియు నపాయములేదు, అతడు కొలదికాలముననే సుఖ ముగా లేవగలడు. కొంచెమోపిక పట్టుము, అనియెను.

ఆమె మెల్లగా లేచి, తండ్రీ! రక్షింపబడితిని యింత చల్లనిమాట పల్కిన వారింతవర కొక్కరునులేరు తండ్రీ! నీ మాట అమృతప్రాయమై నా హృదయమున కూరటఁ గల్గించి నది, స్వామీ! నీవు మా పాలిట భగవంతునివలె దయచేసిన సిద్ధమూర్తివి. యీదీనులకొక త్రోవజూపింపు నాయనా! యనెను. లింగావధూతగా రూరకచూచు చుండిరి. అంత బ్రహ్మముగారా రోగి సమీపమునకు వెళ్ళి, తన కమండలవు నందలి యుదకమును గొని యాతనిపై చల్లెను. మరికొంచెము నీరామె యరచేతిలోఁబోసి యమ్మాయీ! యీ నీటితో నాతని కన్నులుదుడుపుము, కొంచెముసేపల్లు విసరుచుండుము; అని యీవలకువచ్చి కూర్చుండెను. అవధూతకూడ కొంచె మెడముగా కూర్చుండెను. అంత పదినిముసాలు గడచినమీద నా పడియుండిన రోగి, మెల్లగా కనులువిచ్చి ఆనందాశ్చర్య ములతో, శరీరమంతయు జూచుకొనుచు, ఆహా! ఏమి యీ యాకస్మికమైన మార్పు? ఎంత యదృష్టము? అని యటునిటు

చూచి బ్రహ్మముగారు కనిపించగనే సర్వమును గ్రహించిన వాడై, తటాల్న లేచి వారిపాదములపై బ్రాలి, మహాత్మా! నేటికి మీ యవ్యాజానుగ్రహమువలన రక్షింపబడితిని, సంపూర్ణముగ రక్షింపబడితిని, తండ్రీ! ధన్యుడనైనాడను, యింక నన్నాశీర్వదింపుముస్వామీ! అని యనేకవిధముల స్తోత్రము చేసి, పునర్జన్మము నొందినవాడై, యుప్పొంగెను. అనంతరము వీరబ్రహ్మముగారి దీవనలనంది యాదంపతు లెప్పటియట్లు పరిపూర్ణారోగ్య భాగ్యమునందుకొని వారి మహిమల గొనియాడుచు వారియనుజ్ఞ వడసినవారలై తమతావునకుపోయిరి. వారును యధోచిత గమనోన్ముఖులైరి.

పూర్వమిట్లె క్రీస్తుమహాత్ము డొక కుష్టువానికి రోగనివారణజేసి, రక్షణజూపెను. ఆకుష్టువాడా యేసుదేవునిప్రభావమును విని, ఆయన తన రోగము నివృత్తిచేయ గలవాడని నమ్మినవాడై, నిర్మలమైన మనస్సుతో, తనను బాధావిముక్తునిచేసి, పాలించమని ప్రార్థింపజొచ్చెను. ఆయన ఆప్రార్థన లాలకించి దయామయుడై ఆతనిదగ్గరకు వెళ్ళి, చేతితో తాకి దీవించెను. వెంటనే యసహ్యాకరమైన యాతని శరీరము అంతయు పసిబిడ్డ శరీరమువలె, పరిశుభ్రము గలదై, యందమును ప్రకటింపగలిగెను. వాడు మితిలేని యానందముతో వందనములొనర్చి జన్మసాఫల్యము నొందినవాడయ్యెను.

తే. గీ. అపరధన్వంతరి యనంగ, నట్లు కుష్ఠ
రోగము గలానిఁ బ్రోచె నారోగ్యమొదవ,
బ్రహ్మయోగీశ్వరుడు, తన సుప్రభావమునను
జగము తన దైవశక్తిఁ బ్రశంసజేయ॥

## 25. మరణించిన మాదిగవానిభార్యను బ్రతికించుట

కందిమల్లయ్య పాలెములో, కక్కయ్య అను మాదిగ కులస్థుడొకడు ఉండెను. వాడు గ్రామాధికారులైన మున్సబు, కరణములవద్ద నౌకరు (మోతాదు) గా నుండువాడు. అతడు మంచి తెలివితేటలు గలవాడగుటచేత, అప్పుడప్పుడు బ్రహ్మము గారి వేదాంత బోధల నాలకించుచు ఆనందపడుచుండువాడు. ఇట్లుండగా నాయూర గ్రామదేవతయైన పోలేరమ్మ జాతరి వచ్చెను. ఆ దినములలో నొక సమయమందా కక్కయ్య చందానిమిత్తమో, మరి దేనికొరకో, యజమానులచేఁ బంపఁ బడినవాడై బ్రహ్మముగారి యింటికి వెళ్ళెను. ఆయనప్పుడు శిష్యులకు యోగశాస్త్రమునుగూర్చి బోధింపుచుఁడెను. వాడు వెళ్ళుసరికి, ఆ గురుమూర్తి శరీరమందారు చక్రములున్న వనియు, వాటియందారుగురు దేవతలుందురనియు, వాటి యాకారము లీయీవిధములుగా నుండుననియు మున్నుగా నే మేమియో తెలియజెప్పుచుండెను. ఆ కక్క డెప్పటిమాదిరిగా, ఆసక్తికొలది యా యా విషయములు చాటుగానుండి శ్రద్ధగా నాలకించినవాడై, అబ్బో! యీ శరీరంలోనే యింత మంది దేవతలు యిన్ని శక్రాలు వుండగా, ఎక్కడో గుళ్ళో దేముడున్నాడని పోయి పూజించే పూలుకి, పత్తిరికి డబ్బులు యిచ్చి దండాలెట్టియు కూడ ఆబాపనాయనచేత అవతలుండ మని, సీదరింపులు పడటమెందుకు? అని తన యాత్మాభిమాన ముపైకొనగా, "యిదేందో కనుక్కునితీరాలి" అని తటాలున యీవలకువచ్చి బ్రహ్మముగారికి నమస్కారముచేసి, తను వచ్చిన విషయమును తెలియజెప్పి, వెడలిపోయెను.

కొంతతడవైన తర్వాత గ్రామదేవత కొలుపులు జరుగుచుండు చోటికి, మునసబుగారి మరియొక నౌకరు, రొజుచు పరుగెత్తుకొచ్చి 'అయ్యా! కక్కడు యెత్తెత్తి, పెళ్లాన్ని సంపేశాడండి' అని చెప్పెను. మునసబు, కరణము మొదలైన వారు అదేమిటిరా! యని వాని నొక్కపెట్టున ప్రశ్నించిరి. అప్పుడు బ్రహ్మముగారుకూడ నక్కడనే యుండిరి. వాడు 'శరీరంలో దేవుళ్ళుండారని సూట్టానికి, కక్కడు పెళ్ళాంపొట్ట కోసి చూశాడంట, అది సచ్చిపోయిందండి. ఆడు యేడుస్తొం డాడు. ఆగోరం సూడలేక యిట్టావచ్చి యేలినోర్కి మనవి చేశానండి' అనియెను. అప్పుడు వారందరు అయ్యో! యెంత పని చేసినాడు? వాడు శుద్ధ మూర్ఖుడుకాడే! అశ్లీల చేసినా డబ్బా! పాపము, అన్యాయముగా దాని ప్రాణాలు తీసినాడే దుర్మార్గుడు, అని యేమేమో పల్కసాగిరి. అంత బ్రహ్మము గారు వారి నుపలక్షించి, హెచ్చరికగా అయ్యా! మనమిట్లెవ రికి తోచినది వారు మాట్లాడుచు అయ్యో! పాపం, అనుచుం డిన నేమిలాభము; తెలిసియో తెలియకయో వాడు చేసినపొర పాటు నేవిధముగానైన సవరించి వాని యాపద తొలగింపవల యును అని, రండు అక్కడకుపోయి అదియేమిటో చూచి తెలుసుకొందము అనియెను. అంతట కాపు కరణము మొద లైనవారు వెంటరాగా నా బ్రహ్మముగారు కక్కయ్య యింటికి వెళ్ళెను. అక్కడ రక్తసిక్తయై మాంసపుముద్దగా తోచు చున్న భార్య శరీరముదగ్గర కక్కడు కూర్చుండి యేడ్చుచుండి వీరిని చూడగనే మరింత భోరుమని యేడ్చుచు లేచి, అయ్యా! యీ మాంరాజు చెప్పే పాడు యేదాంతం విని పండువంటి కాపు

రాన్ని పాడుచేసుకున్నానండి. దేవరా! అంటూ బ్రహ్మము గారి వైపు చేయిచాపి యీయన వేదాంతము బోధజేయుచు శరీరములో దేవతలున్నారని చెప్పితే, అది నిజమేయని నమ్మి వారిదర్శనంచేయాలని తన భార్య కడుపుగోసి చూడబోయి యిట్లైనానని చెప్పి యేడ్వసాగెను.

అప్పుడు బ్రహ్మముగారు పిచ్చివాడా! వినినమాటలు సరిగా అర్థముచేసుకోనక తొందరపడి తోచినట్లు చేయవచ్చునా? తరువాతరాబోవు హెచ్చుతగ్గులనుగూర్చి యేమియు నాలోచింప నక్కర లేదా ? ముందువెనుకల జూడక, మూర్ఖముగా నిట్లు నిండుప్రాణమును తీసి, యేదో వినుటవల్ల యీ దుర్గతి సంభవించిన దనుచుంటివిగదా? ఈ ఘోరహత్యా పాపము నెవరి కంటగట్టదలచితివి? మూఢుడా! అనుచు చర చర నా యింటిలోనికివెళ్ళి తలుపులువైచి, నేమిమంత్రించెనో గాని, నాలుగునిముసాలైన తర్వాత నీవలకువచ్చి కక్కయ్యా నీ భార్యను పేరుతో పిలువుము అనియెను. అక్కడకు చేరిన వారందరు నాశ్చర్యపడి చూడసాగిరి. అంత కక్కడు భార్యను పిలువగా నామె నిద్రనుండి లేచినదానివలె లేచి ఆయని ఈవలకువచ్చెను. కక్కడు పట్టరాని యానందముతో బ్రహ్మముగారి పాదములమీదబడి స్వామీ! నాతప్పుక్షమించవలెను తమ ప్రభావ మిటువంటిదని యెరుగక యేమేమో ప్రేలితిని, తెలివితక్కువవాడినగు నా యపరాధమును మన్నింపవలెను అని ప్రార్థించెను. కాపు కరణము మొదలైన మహాజనులందరు భక్తియుక్తులై చేతులు జోడించి యనేకవిధములుగా బ్రహ్మం గారి మహిమను వేనోళ్ళ గొనియాడుచు నెవరి యిండ్లకు

వారు వెళ్ళిరి. కక్కడును వానిభార్యయు బ్రహ్మముగారివలన జ్ఞానబోధనంది తరించిరి.

కం. అజ్ఞానిమైన, కక్కని
జిజ్ఞాసుత్వము ఫలించె సిలుగుదొరగి, యీ
ప్రాజ్ఞుండు సూపినట్టి, య
భిజ్ఞ మహామహిమ నతని పెండ్లము బ్రతుకన్॥

## 26. బోధించమని వెంటబడినవారికి బుద్ధిచెప్పుట

కందిమల్లయ్య పాలెములో కాపురము సేయుచున్న వీరబ్రహ్మముగారు గ్రామస్థులకు, వ్యవసాయపు బనిముట్లన్నియు తయారుచేసి యిచ్చుచు కాలక్షేపము సేయుచున్న రోజులలో, వారు ప్రజలలో విజ్ఞానము గలిగించుటకై సులభమైన పద్ధతులతో వేదాంతబోధలు సేయుచుండువారు. అసలు వారి యవతారమే ప్రజయొక్క మూఢభావాలలో నున్న కుళ్ళును దొలగించి, యొకమంచిబాట వేసి, యాబాటలో వారిని నడిపించి యుద్ధరించుట కేర్పడినదౌటచేత వారు బోధ చేసే ప్రయత్నములో నొకరిద్వారా, హెచ్చరికచేయించుట గాని; యొకరిచే బ్రార్థింపబడుటగాని లేక తామంతటతామే ప్రతివాని యింటికి వెళ్ళి, పిలచి పలుకుటలో బ్రతిమాలియు, బలవంతపెట్టియు, వారికి గష్టముగలిగింపక కమ్మనిమాటలతో ఆనందకరములైన విషయాలు అతిసులభముగా తెలియురీతి, అరటిపండు వొలిచి యంచినట్లు అమృతవాసన లుప్పతిల్లు లాగు చెప్పి, యొప్పించి మెప్పులందు మురలుచుండేవారు. వారి

బోధలలో (మానవుల) పురోభివృద్ధి నరికట్టేవిగాని, చిరాకు గలిగించేవిగాని, చిక్కులతో నుక్కిరిబిక్కిరి చేసేవిగాని తల లెత్తక, అమృతసారము లొలికించేవిగా, ఆనందం గలిగించే విగా ఆశపుట్టించేవిగా, ఆశ్చర్యకారకములై అసమానములై అభిరామములై యుండే మెఱుగులు తుఱగలించేవట, అందుకే "పోతులూర్ బ్రహ్మన్న బోధమహిమ" అని యాధునిక మహా కవులుకూడా అభినందించారు.

బ్రహ్మముగారి దృష్టిలో ముఖ్యముగా నన్నవస్త్రాలకై యలమటించే బీదవారు, ప్రాపకమేమీలేక పనిపాటలుచేసుకో జాలనిస్థితిలో బ్రతుకుతెరువులకోస మారాటపడేవారు, అక్షర వాసనలేనివారు కనబడుచుండేవారు. అటువంటివారి నందరి నొకచోఁజేర్చి, యాదరించి, యతిసులభమైన భాషలో, అర్థం చక్కగా తెలిసేలాగు వేదాంత విషయాలను, గేయాలుగా, పదాలుగా, పాటలుగా రచించి వారికి నేర్పి, పాడుచు పర్యటనం చేసి బ్రతకండిరా! అని పంపేవారు. అందులో నవరసమతప్రచా రము, ఆధ్యాత్మిక ప్రబోధము, ప్రచలితమగు చుండేది. అట్లు తయారైనవారే యీనాటికిగూడ కాలజ్ఞానతత్వాలు మున్నైన్ నవి గానంచేస్తూ, యూళ్ళవెంట పర్యటించే బైరాగులు మున్నగువారు, ఆకారణంచేతనే యిప్పటికిని శ్రీ వీరబ్రహ్మము గారి మహిములో శివరాత్రి పర్వదినోత్సవములం దొకనాడు బైరాగుల కన్నసంతర్పణ సేయిదురు.

పూర్వము బుద్ధభగవానుడు విశ్వశ్రేయ సాధకమైన తన మతసారమును లోకమున వ్యాపింపజేయుటకై, పరివ్రాజ

కుల (శిరోమణుల) తయారుచేసి, వారిద్వారా మతప్రచార మును సాగించెను. క్రీస్తుమహాశయుడు కూడా మతప్రవక్తల (భిషప్పుల) నేర్పరచి ప్రేమప్రధానమైన తన మత స్వభావ ములను వారిద్వారా ప్రజల కందించెను. శంకరాచార్యులవారు కూడ నీవిధముగానే శిష్యులద్వారా మతప్రచారము గావించె నని కొందఱనుచున్నారు.

జనసమర్దములు కాని ప్రదేశములలో గురుకులాశ్రమ ములు నిర్మించి, పూర్వపు మహర్షులు తమ సంప్రదాయమునకు చెందిన యొకవర్గమువారికే జ్ఞానోపదేశాదు లొనర్చుచు మత ప్రచారము గావింపుచు వచ్చిరి. బ్రహ్మముగారు కూడా అ పద్ధతి నవలంభించినను, తమయానందాశ్రమములో, కులమత భేదముగాని, వర్గాభిమానముగాని, కలుగనీయక సర్వసమ భావముతో, మానవులందరొకటేయని తెలియజేయుపద్ధతిలో జ్ఞాన ప్రబోధము సేయసాగిరి.

ఈ సందర్భములో మూఢులైన పల్లెవాసులు, పడుచు దనపు బండాటములో, పైలాపచ్ఛీసుగా తిరిగే వారును పని పాటలు లేనివారును, వేలమువెఱ్ఱిగా, బోధసేయండంటూ, దేవుణ్ణి చూపించండంటూ, వెంటబడి వారిని బాధింపసాగిరి. అయితే, ఆయన శాంతమాయల్లరిమూకముందు పనికిరానిదై పోయెను. దానితో వారికిఁ గాలకృత్యాలుకూడా సక్రమంగా దీర్చుకొనుటకు వీలుగాకుండెను. చివరకు భోజనమొనర్చుకొను టకు కూడ సమయము చిక్కుట కష్టముగా నుండసాగెను. నిద్రించుటకు సాకులు గావలసివచ్చెను.

ఆ స్థితిలో వారించుక యాలోచించి యా జనులనందర నొకచో ప్రశాంతముగా నిలువమని, బాబులారా! నిదానించుడు, మీ కందరకును చక్కఁగా బోధించెదను, ఆత్రపడకుండా నామాటలు వినండి, బోధచేయించుకునేవారు ముందుగా నొక పరీక్షలో గెలుపు గాంచవలెను. అట్లా గెలిచిన వారికే బోధ చక్కఁగా వట్టి పుణ్యం చిక్కుతుంది. దేవుడంటే యెవరో తెలుసుకునేలాగు చేస్తుంది; దానిని చెప్పమంటే చెస్తాను. అనియెను. అంత వారందరును నొక్కసారిగా సరే, చెప్పండి మేము సిద్ధంగా నున్నాం అనిరి. అప్పుడు బ్రహ్మముగారు వెంటనే నాయనలారా! రండు, పరీక్షావిధానం ప్రత్యక్షంచేస్తాను. అని చరచరనడిచి పోసాగెను. ఆ జనులందఱును బిలబిలలాడుచు వారివెంట బడిరి. ఆ కలకలమాలించి యేమిటోయని బ్రహ్మంగారి కుమాళ్ళును శిష్యులునుకూడ నటుపరుగెత్తిరి. ఆ మహాత్ముడట్లుపోయి పోయి యొక కొండ మీఁదగల పెద్ద చెఱువు (దిగుడుబావి) ను సమీపించి యట నిలిచెను. ఆ జనులుగూడా సమీపించిరి. వారివైపుచూచి బ్రహ్మముగారు నాయనలారా! అదిగో చూడండి, ఆ చెఱువును, ఆమఱ్ఱిచెట్టునుకూడా చూడండి ఆ చెఱువుమీఁదుగా పోయిన ఆ పెద్దకొమ్మ, దానిమధ్యక్రిందికి దిగినయూఁడ, చూచినారా! చూడండి ఎవ్వరైతే బోధచేయించుకుంటారో, వారు ముందుగా నా యూఁడబట్టుకుని వ్రేలాడుచు, దైవధ్యానంతో, దానినికత్తిబెట్టి కోయవలెను. అట్లా కోసే ధైర్యసాహసాలు కలవానికే, దైవదర్శనం చేయించే బోధ తలకుఁ బట్టుతుంది. ఎవరు తయారుగానున్నారో వారుముందుకు

రండి! అనెను. వారందరొకరి మొగములొకరు చూచుకొన సాగిరి. అట్లా గడియ, రెండు గడియలు, మూడు, నాలుగు, ఐదు, కాలము సడీచప్పుడూ లేకుండా గడచుచుండెను; కాని అందులో నొకడుగూడ నేను” అని ముందుకు రాడయ్యెను. బ్రహ్మముగారొకటి రెండుసారులు హెచ్చరించి, జవాబు పొందక, బాబులారా! యీమాత్రపు కార్యానికే యింతగా వెనుకముందులు చూచేవారు విశ్వవ్యాపకుడైన భగవానుని గురించి పాటుబడుదురా? బోధఅంటే అంతచులకనగానున్నదా? అని శిష్యులవంకజూచి, మీలో నెవ్వరైనను యీపని జేయ గల్గినచో ముందుకురండు” అనియెను. అప్పుడు దూదేకుల కుల్లావాడైన సైదు (సిద్దుడు, యీతనికి మొదట అల్లాసాహెబని పేరున్నట్లు నా మిత్రులొకగు చెప్పిరి) యీవలకు వచ్చి బ్రహ్మముగారికి నమస్కరించి, తండ్రీ! మీయాజ్ఞయైనచో నేనీపని నవలీల జేయగలను. అని చరచర నా చెట్టెక్కి, చెఱువుమీద కొమ్మకున్న యూడబట్టుకొని, వ్రేలాడుచు నొకచేతితో నడుమున దోపియుండిన కత్తినిలాగి యూడ మొదలంటఁగోసినవాడై యా చెఱువునందలి యగాధజలములో బడి మునిగిపోయెను. అంతట ప్రజలలో హాహాకారము లుద యించెను. ఎవరికి తోచినట్లుగా వారు సంశయింపక మాటాడజొచ్చిరి. కాని, యొక్కడును సాహసించి దూకి యాతని బైటికిదీసి బ్రతికించవలెననే పాపానఁబోలేదు. ఆర్భాటముతో నందఱును చెఱువుచుట్టూ మూగి చూచుచుండిరి. అట్లొక ఝాము గడచెను. చచ్చిపోయినాడంటే, చచ్చిపోయినాడని

యందరును విచారముతో చప్పరించుచు వెనుకకు మరలిపోవ సిద్ధముగా నుండిరి.

అంతవరకు నెడముగా నిలుచున్న పీరబ్రహ్మముగారు బావియొద్దనకు వచ్చి నిదానించిచూచి సిద్ధా! అని పిలచెను. ఆ వెంటనే యతడు నీటినుండి పైకితేలి స్వామీ! యిదిగో వస్తున్నాను, అంటూ యీదుకురాసాగెను. ఆసంఘటన కాపరిజలందరు నాశ్చర్యపడి చూచుచు బ్రహ్మముగారి ప్రభావమును గ్రహింపజాలక తాము సూపిన తెలివితక్కువ తనానికి చాల సిగ్గుపడినవారై వినయముతో చేతులుజోడించి స్వామీ! బ్రహ్మముగారూ మీ గొప్పతనము తెలియనేర్వాక తప్పుగావించితిమి. మీమహిమ నెరుంగ జాలునంత వివేకము మాకులేదు, క్షమించండి,అంటూ క్రమంగా నిష్క్రమించిరి.

ఈవిషయమును మరియొకటి రెండు విధాలుగా కూడా చెప్పుచున్నారు బ్రహ్మముగారివద్ద విశిష్టమైన వేదాంతవిద్యను పొందుటకై యడుగబోయిన అల్లాసాహెబు (సైదు, యితడే సిద్ధుడు) హిందూమతముయొక్క గొప్పతనాన్ని గురుతించి, యందలి యమృతసారము గ్రహించుటకై యక్కడనే బ్రహ్మంగారి దగ్గర) నిలచియుండుటవల్ల, నాపని తన మతమువారికి విరుద్ధమైన చోటచేత నట్లుండుట కిష్టపడక 'పిలువబోయిన పీరుసాహెబు' (అతనితండ్రి) ఆదిమనకు బనికిరాదు కాబట్టి యింటికిరమ్మని బలవంత పెట్టినవాడై, యెవ్వరెంత చెప్పినను వినక మూర్ఖముగా, నెట్టులైన (సిద్ధుని) తీసుకునిపోవలయునని పీటవేసుకుని యుండగా, నాతనికి, సిద్ధుని యాత్మశక్తి, మనో

నిశ్చలత్వము, మత విశ్వాసము మున్నైనవి బ్రహ్మముగారు ప్రత్యక్షముగా చూపదలచియుండిన దినాలలో పై సందర్భము జరిగెను. అప్పుడు, అనగా సిద్ధుడా మఱ్ఱియూడను పట్టుకొని వేళ్లాడుచు, తండ్రిలో బాబా! యికనైనా, నాకోరికను అంగీకరించి నీపట్టుదల విడువుము. అంటూ దానినికోసి, చెరువులో బడిపోయెనట. ఆసమయమున పీరుసాహెబు, పట్టరాని దుఃఖావేశములో, బ్రహ్మముగారి పాదాలమీద వ్రాలి, బాబాజీ! నాకొడుకును రక్షించుము. మీయిష్టమువచ్చినట్లుగా, మీ చదువులు నేర్పి, మీమతం బోధించి, మీదగ్గరే ఉంచుకొనండి ఎక్కడుండిననేమి? ఎట్లైనవాడు బ్రతికినచాలును. రక్షించు తండ్రీ! రక్షించు. అని ప్రార్థించెనట. అంత నా బ్రహ్మము గారు చిరునవ్వుతో సిద్ధా! అని పిలువగానే, బావిలోనుండి ఆఁ! అంటూ బైటకు వచ్చినాడట.

పూర్వము శంకరాచార్యుని తల్లి యాతని సన్యాస స్వీకారమును గూర్చి యెంత జెప్పినను యిష్టపడకుండుటచేత నొకనాడు, నదిలో మొసలిచేత పట్టువడి చావసిద్ధముగానున్న వాడై దీనముగా, తల్లీ! యిప్పుడైన నాకోరిక నంగీకరించరాదా! యనగా, నా యమాయికురాలు, సరే, నాయనా! నీయిష్టము వచ్చినట్లుండవచ్చును, నీయాపదను తప్పించుకుని యీవలకురా తండ్రీ! నీవు బ్రతికినచాలు ననెనట. ఆ వెంటనే యాయన మొసలినివిడిపించుకొని ముందుకువచ్చినాడు. యీ కథ దీనిని పోలియున్నది. ఇది యింకొకవిధముగాకూడ చెప్పు చున్నారు. మరపులేని శ్రద్ధాభక్తులతో, మంచి నీతినియమా

లతో, సిద్ధుడు (సైదు) బ్రహ్మముగారి శిష్యుడై, సేవజేయు చుండెను. ఆ గురువుగారుకూడ నాతనిపై వెలలేని వాత్సల్య ముతో విద్యలు గరపుచుండిరి. ఇదిచూచిన వారి కుమారులు సహించజాలక, నాతడు కులము తక్కువవాడనియు, మతాం తరుడనియు, వానికి బ్రహ్మవిద్య నుపదేశింపరాదనియు నింకే మేమో తండ్రిగారికి చెప్పుచూ నతని నవమానకరముగా చూడసాగిరి. అప్పుడు వారికి సిద్ధునిగొప్పతనమును జూపుటకై బ్రహ్మముగారు పైకథ నడిపినారట.

ఈ సందర్భములో, వీరబ్రహ్మేంద్రులవారి శిష్యు లంద రును, సిద్ధునియం దసూయచే నాతని తక్కువజాతి మున్నైన వాని నెన్నుచు, తామే గొప్పవారమనే గర్వముతో ప్రవ ర్తించుటచేత, వారికి గర్వప్రాయశ్చిత్తము చేయుటకై, బ్రహ్మముగారు ఒకచోట పుచ్చి పురుగులతో లుక లుకలా డుచు, సహింపరాని దుర్గంధముతో నిండిన, కుక్కమాంస మును కల్పించి, గురువుగారిమాట నతిక్రమింపని విఖ్యాతిగు చున్న యీ శిష్యులను భుజింపుడనగా, వాండ్లది చేయజాల కున్నప్పుడు, సిద్ధునిచేతఁ దినిపించి యాతనిభక్తి విశ్వాసముల బాహుళ్యమును వెల్లడించెనని చరిత్ర జెప్పుచున్నది.

పలువురు శిష్యులలోఁ బ్రజ్ఞావంతుని బైటపెట్టుటకు గురువేదో దుర్ఘటకార్యము నియోగించి, దాని నిర్వహణ ద్వారా తారతమ్యనిరూపణ సేయుట యార్య సాంప్రదాయ ముగానున్నది. సమర్థరామదాసస్వామి, సుప్రసిద్ధ మహారాష్ట్ర రాజ్యస్థాపకుడైన శివాజీ చక్రవర్తి గురువు యీయనే తుకా

బ్రిహ్మానందస్వామి యని కొందరందురు) శిష్యుల యహంభా
వము రేకెత్తుట చూచి వారి గర్వాపహరణమునకై, యొకనా
డేదో వ్యాధినటించి దానికై, పులిపాలు కావలయునని యా
నియోగములో నది సాధించి తెచ్చిన శివాజీ గొప్పదనాన్ని
ప్రిదర్శించినవాడై వారి దుర్గర్వమును దూరముగావించెను.

ఆ. వె. పరుల గొప్పఁదనము భావింపనోర్వక
మొరటుగా చరించు మూర్ఖులకును
గర్వమందు వాచకంమన్యులకును, వి
వేక మొసగిననాడు వీరగురుడు॥



## 27. దువ్వూరులో కాళీ ప్రతిష్ఠ

మన దేశమునం దవతరించిన మహాత్ములు విగ్రహారాధ
నము నిరసించి, యేకేశ్వరోపాసన ప్రజలలో వ్యాపింపజేయు
టకై పాటుబడిరి. వారి ప్రబోధములు వారి మతోద్దేశ్యము
లును, భగవంతు డొక్కడేయని తెలియజేసే పవిత్ర, వేద
మంత్రముల భావములనే ప్రచారము సేయునవియై యుండినను
కాలక్రమమునఁ బ్రసిద్ధికి వచ్చిన రామ, కృష్ణాది మహాత్ముల
(భగవంతుల) విచిత్రవిలాసము లర్చనీయములై లోకుల యా
నందోత్సాహములఁ బెంపొందింపఁ జాలిన సందర్భమున జిత్ర
కళకు క్రొత్తసిరులబ్బుట తోడనే అగ్రగణ్యులైన బ్రాహ్మణ
(మత) వర్గమువారు సన్నగిల్లిన యన్నవస్త్రిల సమృద్ధిని సంత
రించుకొనుటకై, తమ బుద్ధిబలము నుపయోగింపఁ బూనిరి.
అంతవరకీ బ్రాహ్మణవర్గము వారిచే ననేక నష్టకష్టాలకు

బాల్పడి యగచాట్లకు లోనయినస్థితిలో, తమను, తమపరిశ్రమ లను గౌరవించి కాపాడిన బౌద్ధరాజన్యుల ప్రభావము తగ్గి పోవుటచేత చేసే పనులకు తీసికట్టుగలిగి జీవనోపాదులకు తడుముకోవలసియుండిన శిల్పిజాతివారు (విశ్వబ్రాహ్మణులు) ఆ సమయమున, గరదీపికలవలె వారికంటఁబడి గౌరవగంధాల నాఘ్రాణింపగలిగిరి.

అంతట దేశము కళావంతముగా నుండవలయుననికోరే శిల్పాచార్యుల చిత్తవృత్తులు చిగురించి బాపనయ్యల పలుకు తీరుల ప్రాబల్యముతో, రాముడు, కృష్ణుడు, శివుడు, నటరాజు, కాళికాదేవి, గంగానమ్మ మొదలైన హిందూదేవత లంతా శిలాస్వరూపాలతో చిన్నెలు వన్నెలు గలిగి బహు ముఖాలతో ప్రపంచమునం దవతరించి ప్రజల మన్ననల నంద సాగిరి. అప్పటినుంచి, దేవతాపూజలు తీరు తీయములందు లాగు దేవాలయశిల్పాలు విగ్రహారాధనలు విస్తరిల్లినవి. క్రమ ముగా ప్రతి గ్రామములో, ప్రతిపట్టణములో, ప్రతిపల్లెలోను శివాలయాలు, విష్ణాలయాలు, రామమందిరాలు. కాళీ నిల యాలు. గంగానమ్మ గుడులు వెలసి ప్రజల యాస్తిక్యాన్ని బలపరచినవి.

అయితే అద్వైతబోధకులైన మహాత్ములగు, మహ మ్మద్ ప్రవక్త, క్రీస్తుమహాత్ముడు, బుద్ధదేవుడు మున్నగువారు ప్రతిమార్చనా విధానము పనికిరాదన్నారు. వేదాంతగీతాలు విరజిమ్మిన వేమన్నగారుకూడ 'రాళ్ళు దేవులైన రాసులు మ్రింగవా' అని విగ్రహాపూజను వెక్కిరించినారు.

బ్రహ్మముగారు కూడా పై పద్ధతిలోనే "చిల్లరరాళ్ళకు మ్రొక్కుచునుంటె చిత్తము చెడురా ఒరేయొరే" అని శిష్యులకు దెలియజెప్పుచు స్వరూపార్చనము నిరోధించు పాటలే పాడినారు, అయితే స్వరూపారాధన కూడా నంగీకరించినట్లు చరిత్ర చెప్పుచున్నది. వారు మొదట గురుదేవుని స్మారక చిహ్నముగా 'నల్లాటపల్లె' లో వీరభద్రస్వామి వారి విగ్రహమును ప్రతిష్టించినారు, పిమ్మట ఆశ్రితుల మనశ్శుద్ధికై, అక్కంపేటలోను, కందుకూరులోను గురుమందిరాలు గట్టించినారు. కడపజిల్లా దుప్పూరు గ్రామములో దుర్గాప్రతిష్ఠ జేసినారు. (ఇది కాళీ ప్రతిష్ఠ అని స్థలజ్ఞులంటున్నారు) వీరబ్రహ్మముగారు సంచారార్థముగా విజయవాడకు వెళ్ళినప్పుడు, ఒకనాడు కృష్ణానదిలో స్నానముచేసి యచ్చటి కనకదుర్గాదేవిని దర్శించుటకై, యాలయమునకు వెళ్ళిరట. అవి నవరాత్రమహోత్సవ దినాలగుటచే నప్పుడాలయావరణలో జనులెక్కువగా నుండిరి. ఆయన గర్భాలయములోనికి బోవనుండగా దేవీ ఆలయములోని కెవ్వరిని రానీయని యర్చకుడు 'లోనికిరా వీలులేదని' యడ్డగించెను. అప్పుడు బ్రహ్మముగారు చిరునవ్వుతో వెనుకకుతగ్గి 'ఏమేతల్లీ! ఇన్ని పూలు; పత్రాలు, తెచ్చి యిచ్చిపోదామనుకుంటె నీసేవకులు నన్ను లోపలకు రావద్దంటున్నారు, దయచేసి నీవైనా యిటు వచ్చి వాటి నందుకొనుము' అనెనట. వెంటనే యా కనకదుర్గాదేవి (విగ్రహము) గణగణలాడుచు నీవలకు వచ్చి మన బ్రహ్మగారిముందు నిలువబడినదై, వారు తెచ్చిన సేవా సమర్పించి 'యికనీచోటికి పోతల్లీ! అనగానే తిరిగి యథాస్థాన

ముఁజేరెనట. ఈ సందర్భమంతయు విన్నవారైన దువ్వూరు వాస్తవ్యులగు భక్తులు తమయూరిలో దుర్గాప్రతిష్ఠ చేయించుకొనన నెంచి యాపని నెరవేర్చుటకై, బ్రహ్మముగారినిఁ గోరిరి. వారా భక్తులకోరిక దీర్చుట కంగీకరించినవారై, యందు కవసరములైన పనులన్నియు బూర్తిచేసుకుని నియమిత కాలానికి నన్ను బిలిచినచో వచ్చెదనని చెప్పియుండిరి.

కొలది రోజులలో, నమ్మవారి విగ్రహము, గుడి, తయారై, ప్రతిష్ఠా సంబంధములైన, సంబారాలన్నియు సేకరింపబడిన తర్వాత నిర్ణయింపబడిన ముహూర్తమునాటికి, పౌరుల యాహ్వానముపై, బ్రహ్మముగారు దువ్వూరునకు విచ్చేసినవారై, శాస్త్రోక్తముగా ప్రతిష్ఠాకలాపములు నిర్వర్తించి, అమ్మవారిని గుడిలో నిలిపి; యర్చకునకు పూజాకార్యాదు లప్పగించి యీవలకు వచ్చిరి.

శాక్తేయమతము శంకరాచార్యులచే నిలుపబడినదైనను, ఆ మతమువారు, మద్యమాంసాదులను యథేచ్ఛగా నుపయోగించుచు, నాపనియే సదాచారమని వక్కాణింతురు అందుకే, మానవలోకానికి సంస్కృత భాషాభిక్ష పెట్టిన మహాత్ముడైన కాళిదాసమహాకవికి, మనవారు కల్లుద్రాగుడు మొదలైన దురాచారా లంటగట్టగలిగినారు. ఇటీవల వైదిక (మత) వాసనదగిలి యీ మతాచార్యులు కొందరు కల్లునకు బదులుగా కమ్మరసమును (ఘీన్‌రు మజ్జిగలో బెల్లము గలిపినదానిని కొన్నిచోట్ల వాడుదురు. ఇట్లుచేసినది రంగులోను, రుచిలోను, గుణములోను, కల్లున కేమాత్రమును తీసిపోదట)

మాంసమునకు బదులుగా మాషచక్రములు (గారెలు) ను అమ్మవారికి నివేదనచేసి, యంతటితో తృప్తిపడుట గలిగినను అసలైన కాళికాభక్తులు కల్తీలేని కల్లూ, మాంసమూ సమర్పిస్తేనేగాని అమ్మవారి కానందము గలుగదని యాచరించి యారగించి, 'త్వమేవాహం' అంటూ ఆమెగారితో ఔచిత్య విచారణ చర్చలు సాగిస్తుంటారు.

కాలక్రమముగా సన్నగిల్లుచూ వచ్చిన యీ మత న్యాయములనే పట్టుకుని శంకరాచార్యుల తర్వాత ఎనిమిది సంవత్సరాల కాంధ్రదేశములో నవతరించిన వల్లభాచార్యుల వారు, మరికొన్ని యసభ్యాచారములతో జేర్చి, తమ 'పుష్టి మార్గ' మతములో నిరంకుశప్రచారము గావించినారు.

ఆట్లు బ్రహ్మముగారిచే, నా దేవీ యాలయములో పూజావిధానాదుల కధికారమును పొందిన యక్బరుమహాశయుడు పుష్టిమార్గ మతవాసన యొంటబట్టిన బుద్ధిమంతుడు గాబోలును, ఆసాయంకాలము, తనవిశ్వాసప్రకారము ధర్మము తప్పకుండా, తాటికల్లును, తగరుమాంసమును, తక్కువకాని భక్తితాత్పర్యాలతో దెప్పించి, యమ్మవారికి ధర్మకైంకర్యం జేసి, తనిసి, తబ్బిబ్బై, మతాచార నివేశాన్ని మస్తుగా ప్రదర్శించాడట. అది మరునాడు శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామివారికి వినవచ్చెను, వారు ధర్మకర్తను బిలిపించి, యాతప్పు పనులం గూర్చి తగినట్లు బోధించియు, తాము తెల్పిన యహింసా ధర్మాలపై, మూర్తి పూజావిధానాలపై, మానవ మతాచారాలపై, వారి (పౌరుల) హృదయము లెంతగా లక్ష్యముం

చినదియు గ్రహించినవారై, యీ విధములైన పూజాభోగా లతో పొలుపుగాంచే యీ యమ్మవారీయూర నెంతరో కాలము నిల్వజాలదని చెప్పి, వెడలిపోయిరట.

ఆ తరువాత నెట్లుజరిగెనోగాని యీనాడు మాత్రమూ దువ్వూరిలో, కాళికాదేవి, విగ్రహము ఊరిబైట శిథిలాల యములో నుండినదై, పూజాపునస్కారాల మాట మరచి పోయి ప్రశాంతముగా తపస్సు చేస్తూఉంది. బ్రహ్మముగారి మాట ప్రపంచాదర్శ మైనదని యీదృశ్యము యిప్పటికి తెలియజేస్తూనే వుంటుంది.

తే. గీ. పెద్దలును శాస్త్రములును, చెప్పిన విధాల
నడువజాలనిచో "వృద్ధినాస్తి" యనుచు,
తెల్లముగ జెప్పె నావీర దేశికుండు
జీవహింసాదుల నిషేధ భావములను॥



## 28. పుష్పగిరి అగ్రహారము

బ్రహ్మముగారికి శిష్యుడైన సిద్దయ్య చదువుకోసం మఠములోనే నివసించుట కిష్టపడినప్పుడు తండ్రియైన, పీరు సాహెబు యెంతబ్రతిమాలినను కుమారుడు తనమాట వినక నిరాకరించినందువలన చేయునదిలేక తాను పరాభవింపబడి నట్లు భావించినవాడై, వెంటనే యతను కడప నవాబుగారి దగ్గరకు బోయి "బ్రహ్మముగారు మహమ్మదీయు లందరకు

హిందూమతమును బోధచేసి, మనమతముపై మర్యాద లేకుండా దూషించు చున్నాడనియు, తన కుమారుడైన యల్లాసాహెబు (సిద్దయ్య) కేవో, మాయ మంత్రాలు నేర్పి, మతిని తిరగ దీసి, తన మాటను వినకుండా చేసినాడనియు, పిర్యాదు చేసెను; అందుపై నవాబు, కోపించి యీవిధముగా మత మును కించెపరచిన నేరమునకు వెంటనేవచ్చి తగిన సమా ధానమియ్యవలసినదని బ్రహ్మముగారికి నోటీసు చేసెను. ఆ సందర్భమున నవాబుగారికి జవాబుచెప్పుటకై బ్రహ్మంగారును, సిద్దయ్యయు ప్రయాణమై కడప నగరానికిఁ బోవుచుండిరి.. మార్గమధ్యమున పుష్పగిరియను బ్రాహ్మణాగ్రహార ముండెను

పుష్పగిరి అనగా బ్రాహ్మణ మతస్థులకు బట్టుగొమ్మ అందరకంటే మేమే అగ్రగణ్యులమనే కులతత్వము ఆయూర మూర్తీభవించి యుండెను. పూర్వము మణ్మతస్థాపన చేసిన శంకరాచార్యులవారు అచ్చటనే గురుపీఠమును స్థాపించి యుండుటచేత, వేదాదివిద్యలన్నియు నాపీఠముద్వారా సులభ ముగా, లభించుచుండుట కారణముగా వారు గర్వించి యిత రుల నేమాత్రమును లెక్కసేయకయు, నితరకులమువాడు చదువుకున్నచో వాని నేవిధముగానైన అవమానింప జూచు టయు మొదలైన దుర్గుణములతో, అచ్చటివారా రోజులలో, నిరంకుశముగా ప్రవర్తింపుచుండిరి. అందుచే బ్రాహ్మణేతరు లైన విద్వాంసుడెంత గొప్పవాడైనను, ఆయూరువెళ్ళి, యవ మానింపబడి పోవుచుండుట పరిపాటిగా జరుగుచున్న విష యమైయుండెను. మన గురుశిష్యు లిద్దఱును ఏ యుపనిషత్తు

నందలి వాక్యార్థముల గూర్చియో సంభాషించుకొనుచు నా యూరి బజారున బోవుచుండిరి. వేదార్థముల నెఱుగుటకు హక్కు మాకే తప్ప యితరుల కేమాత్రము లేదని, వాదించే విప్రమహాశయులు కొందరు వీరినిచూచి మొదట బ్రాహ్మణులే యనుకొనియు, వీరిసత్యార్థ ప్రతిపాదన మొదలైన వాక్యములు క్రొత్తక్రొత్తగా చెవులదూరుటచే వెంటనే శంకించిన వారై, వారి యెదుటకువచ్చి నిలువబడి, మరేమియు మాటాడకనే తీవ్రముగా "మీరీయూరి బజారునుండి యిల్లు పోవుటకు వీలులేదు. కావున నిక్కడనుండియే వెనుకకు తిరిగి పొండని ధిక్కరించి పల్కిరి,

అప్పుడు సిద్దయ్య వారితో శాంతముగా మేమొకపని గలిగి యీమార్గముననే పోవుచుంటిమి. కాని యెవ్వరికిగాని యేయపకారముగాని చేయుతలంపుతో నిల్లు పోవుటలేదనియు, మాసంగతి సందర్భములు తెలిసికొనక యిట్లవమానపూర్వకముగా, తిరిగిపొమ్మనుట ధర్మముగాదనియు పల్కి మా దారిని మమ్ము పోనిండనియెను. అప్పుడు వారున్న ఉద్రేకములో యీమాటలు చెవులఁబట్టించుకొనలేదు. కాగా మరింత తీవ్రముతో వెనుక ముందులాలోచింపక శూద్రముండాకొడుకులువచ్చి శుద్ధమైన బ్రాహ్మణులున్న అగ్రహారము నడివీధి నుంచి వేదమంత్రాలు చదువుచూ వెళ్ళుతుంటే విని యూరుకుంటామా? యింతపవిత్రమైన బ్రాహ్మణాగ్రహారములోనే యిలాటి అధర్మ ప్రచారమునకు సహపమా? అది యెంత మాత్రము జరుగదు. యేనాటికినీ జరుగదు; శ్రీరామచంద్రుల

వారికాలములో అధర్మముగా తపస్సుచేసిన సూద్రుని బుఱ్ఱ యెగిరినట్లుగా, మీపుఱ్ఱలెగుర వలసినదే ? జాగ్రత ! పొండు, త్వరగా పొండు అని గద్దించిరి.

అపుడు సిద్దయ్య యెంత శాంతముగా మాటాడినను బ్రహ్మముగారెంత నెమ్మదిగా బోధించినను 'వృధా" యగుట యేగాక, వీరికి వారికి వాదోపవాదములు చెలరేగి, యొకరి నొకరు నిందించుకొనుట, తూలనాడుట, పాతవారి బండార ములు బైటపెట్టి హీనపరచుట, వరకు వచ్చెను. అంత నా యగ్రహారీకులు సత్యవాదనకు జాలక, సమాధాన మీయ లేని స్థితిలో, కుత్సితబుద్ధి కొలతకుమీరగా 'నిదిపనిగాదురా' యని విజృంభించి రాళ్ళురువ్వ నారంభించిరి.

అప్పుడు సిద్దయ్య గురుదేవునివైపు జూచెను. బ్రహ్మము గారికిగూడ నా చిఱునగవుతో పాటు చిత్తమునందొక విధ మైన యసూయ కలిగెను. యిక నూరకుండుట యింగితము నకు విరుద్ధమనియో ఊరకున్నచో నేదయిన యపాయము గలుగుననియో, తలంచిరి కాబోలును, వెంటనే కొలది యా గ్రహమును సూచించు దృష్టితో కన్నులదెఱచి యూరివంక చూచిరి. చూచుటతోడనే యాకస్మికముగా అగ్గిమంటలు రేగి, యగ్రహారమునంతను తగులబెట్ట సాగెను. అట్లు హఠాత్తుగా కాలిపోవు గృహముల చిటపట ధ్వనులతో పాటు, వారి బిత్త రంగములుకూడ పెట్లి, బీటలువారగా దిక్కు తెలియక తెలివితేటలు చెడి, తికమకలుపడి, హాహారవాలతో ఆక్రంద నాలతో అగ్రహారీకులైన వారందరు నటునిటు పరుగులెత్త

సాగిరి. ఆలుబిడ్డల శోకతాపాలు, అగ్నిజ్వాలల తీక్ష్ణరూపాలు, ఒక్కసారిగా "సర్వనాశనమౌతున్నదిరా" యని గలిగించిన సమయజ్ఞానమువలన అంతవరకు తమను ప్రేరేపించిన మూఢ బుద్ధియంతయు దహింపబడగా, సహింపుతో డిసద్బుద్ధి యల వడుటతో, సదసద్వివేకముగలిగి, దురభిమానము తొలగిపోగా ఆ యగ్రహారపు బాపనయ్యలందరు, వెంటనే బ్రహ్మముగారి పాదములమీఁదబడి, స్వామీ! రక్షింపుడు; అజ్ఞానులమై యప చార మొనర్చితిమి, మూఢులమై, తెలియక చేసిన మాయప రాధమును క్షమించి, మమ్ముద్ధరింపవలయును; నిముస మాల సించేనచో నిశ్శేషముగా నగ్రహారమంతయు భస్మీపటల మగును గురుదేవా! అనేకులైన యాకుటుంబీకుల యార్త నాదము లాలింపుము, స్వామీ! దయార్ద్రహృదయుడవు, దైవ మూర్తివి గురుదేవుడవు, నీకు దెలియనిదేమున్నది? రక్షిం పుము, స్వామీ! రక్షింపుము. అని యనేకవిధములుగా ప్రార్థిం పుచు వాపోవఁజొచ్చిరి. అంతట కరుణామయులైన యాబ్రహ్మము గారు వారి యవివేకము పరిణమించినదని తలచినవాడై ప్రశాం తములైన చూపులతో మరల నొకసారి యాయూరివంకఁ జూచెను. ఆ చూపులతో నత్యాశ్చర్యముగ తెరతిరిగినట్టు లా యగ్నిమంట లన్నియు నంతలో మాయమగుటయే కాక గ్రామ మెప్పటియట్లు చూపట్టి చూచువారి కానందాశ్చర్యములు కలిగించెను.

అంత నాయగ్రహారీకులు పట్టరాని యానందావేశ ముతో వెనుకముందు లాలోచింపక నాగుమూర్తిని బ్రహ్మ రథముపట్టి యూరేగించి గౌరవించి, పూజించి, వారిబోధలు

చక్కగా నాలకించినవారై ఉన్నగర్వమంతయు నూడిపోగా, యంతటినుండి, నేనెక్కువ, నీవుతక్కువ అనే భేదభావమును వదలి, పరులను దూషించుట పాపకార్యమని తలంచుచూ, సర్వసోదర న్యాయముతో సదసద్విజ్ఞానము గలిగి మంచితన ముతో మెలంగజొచ్చిరి.

మ॥ తమగొప్పందన మొప్పిదంబనుచు, నౌద్ధత్యంబుతో
నెంతయున్
క్రమముందప్పి చరించు భూసురుల దుర్గర్వంబువోగొట్టి, స
త్యమతన్యాయములన్ గ్రహింపగల బోధం జేసి బ్రహ్మంబు, వే
దమత స్థాపకుడైన శంకరుని సద్భావంబు రేకెత్తగన్॥



## 29 దొంగల పరాభవం

శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వాములవారు కడప నవాబుచే గౌరవపూజా సత్కారము లందుకొని యనేకములైన వస్తు వాహనములతో తిరిగివచ్చిన సందర్భములో నొకనాడు వారు గొనివచ్చిన పట్టు జరీశాలువలు, బంగారునగలు, రత్నహార ములు మొదలైన విలువగల సామాగ్రినంతను, స్నేహితుడైన పూదోట లింగప్ప మున్నగువారికి జూపించుచు, నవాబుగారు చేసిన మర్యాదలను గూర్చి ముచ్చటించుచుండెను. ఆసమయ మున నొక దొంగలనాయకుడు గూడ సామాన్యభక్తుని వలె యచ్చటకువచ్చి యంతయు జూచినవాడై, యాసొత్తు నెట్లైన నపహరించుకొని పోవలెనని యూహించెను.

నాటి రాత్రి మఠములోని వారందరును యథాకాలా నికి సాపాటులొనర్చి కొంతవడి యానందకరముగా నేవో విష యాలు మాట్లాడుకొనిన పిదప సుఖనిద్రజెందిరి. మన చోరీ వాలా వస్తాదు తగిన జాగ్రతతో నదివరకే తన ముఠావారి కందరకు నడవదగిన నడక, చేయదగిన పనులు, ఉండదగిన యునికి, మున్నెన్నవి చక్కగా బోధించి, వారిని హుషారుగా నుండమని, నియమించియున్న వాడుగావున, వీరందరెప్పుడు పండుకొని నిద్రపోవుదురా ? ఎప్పుడు మనపని నెరవేర్చు కొందమా ? యని కనిపెట్టుకొని యుండి యుండి యెట్టకేలకు వారందరు నిద్రావశులైనారని తెలుసుకున్నవాడై, మరుగు మూలలడాగియుండిన, తనయనుచరులకు సంజ్ఞచేసెను. అంతట వారందరును మెల్లమెల్లగా లోనికి ప్రవేశించి యా వస్తువు లుంచిన పెట్టెలు తెరచి యచ్చటి తైలదీపముల వెలుగులో యథేచ్ఛగా నన్నియు మూటలుగట్టి, సంతోషముతో, మనిషి యొకమూట వదలున నెత్తి తలపై బెట్టుకొని, వెనుకకు మర లిరి. ఎప్పుడైతే వాళ్లు అట్లు నెత్తిమీద మూటలు సర్దుకొని సంబరాలుపడుచు నికపోవుదమని ముందడుగు వెట్టిరో? అప్పుడే వాళ్ళకళ్ళకు చీకటులుగ్రమ్మి సర్వము నంధకార బంధురమై యేమియు కన్పడకపోయెను, మరియొక యడుగెత్తివేయలేక పోయిరి; ముఠానాయకుడు మాత్రము కొంచెము ముందుకు వచ్చి యటునిటు పరికించి వాళ్ళని రమ్మని చేయూపెను.

అయితే, ఏమిలాభము ? వాళ్ళట్లే చూచుచు నిలచి యుండిరి, మాటాడరు; సంజ్ఞచేయరు, ఎంత చేయూపినను

అంతే; ఆతడు రోషమావేశింపగా, పండ్లు పటపట గొరుకుచు పోయి యొకనిచేయి బట్టి లాగెను. వాడు కొయ్యవలె బిగిసి పోయి కదలలేదు. అతని గుండె కొట్టుకొనసాగెను. ముచ్చె మటలు గ్రమ్ముచుండగా నొక్కొక్కనిలాగి చూచెను. వాళ్ళు చైతన్యహీనులై, కదలక విగ్రహాలువలెచూపట్టిరి. వాడేమియు తోచక నిర్ఘాంతపోయి నిలుచుండెను. అంతే; ఇదేమిటిరా! యిట్లు జరిగిందనికాని, యిప్పుడేమి చేయవలయునని కాని, మరి యేతలపుగాని, యాతనికి గలుగలేదు. తుదకు మాటాడు టకుగూడ శక్తిగలుగలేదు. అట్లే చూచుచు నిలువబడియుం డెను. కొంతసేపటికి తెల్లవారెను.

కందిమల్లయ్యపాలెములోని వారందరును లేచి యెవరి పనులువారు దీర్చుకొనసాగిరి. ఇంతలో మఠములో నేదో చిత్రము జరిగినదని పుకారు బయలుదేరి యూరంతయు వ్యాపించెను. అందుచే నూరిలోని వారొక్కరొక్కరే మఠావరణములోనికి వచ్చుచుండిరి. వీరబ్రహ్మముగారు యధాకాలములకు లేచి కాలకృత్యాములు దీర్చికొని లింగా వధూత మున్నగువారు వెంటరాగా మఠముం బ్రవేశించిరి. అప్పటికే మఠావరణలో చాలమంది జనులు మూగియుండిరి. వారాజనుల నొత్తిగించుకొని లోనికిపోయి చూచుసరికి ఏము న్నది? దొంగసర్దారులు మాటామంచే లేక, కన్నులుదెరచి కొని, పైమూటలతో దేవలోకమునుండి దిగుమతియైనవారివలె యచంచల స్వరూపులై నిలచియుండిరి. వీరబ్రహ్మముగారికి వారిని చూచి నవ్వు వచ్చెను నవ్విరి.........

దైవతేజస్సుగల బ్రహ్మముగారి దర్శనమగుటతోడనే దొంగల నాయకుడు, చైతన్యముగలిగి, వెంటనే వారిపాదముల మీద వ్రాలినవాడై, స్వామీ! రక్షింపుము. బుద్ధి గడ్డిగరచి మొద్దు బారుటచేత మీప్రభావమును గుర్తింపలేక మూఢులమై యిట్లు చేసితిమి. యిదియంతయు నాదుర్మార్గము. దాసుడనైన నన్ను కాపాడుము తండ్రీ! యిట్లాగే యిదివరకపచారము చేసినమావంటి దురాత్ముల నెందరనో రక్షించినావు దొరా! దయగలవాడవు భక్తులగాపాడే భగవంతుడవు, తప్పులు మన్నించే తండ్రివి, శరణుజొచ్చినాను, నీపాదాలుసాక్షిగా, నింకెన్నడు నిట్టిపని సేయను, ముమ్మాటికిని సేయను రక్షింపుము తండ్రీ! రక్షింపుము అనుచు నేడ్వసాగెను. స్వాముల వారి దయాహృదయము ద్రవీభూతమయ్యెను. ఆయన వెంటనే యాతనిలేవనెత్తి ఓయీ! భయపడకుము, మరేమియు ప్రమాదములేదులే; చక్కబడును, అనియెను. వాడు చేతులు జోడించి నిలిచి జాలిగొలుపు చూపులతో, తనయనుచరుల వంకను, బ్రహ్మముగారివంకను, దీనముగా చూడసాగెను. ఆమహానుభావుడది గ్రహించి. ఓయీ! వాండ్లనిటు తీసుకు రమ్ము, అనెను. వాడు స్వామీ! వాళ్ళుకదలుటలేదు పిలిచితే పలుకడు; మనవంక చూడరు కొయ్యబారిపోయి నిలబడినారు. స్వామీ, ఏలినవారి యనుగ్రహము... అని చేతులు నలుపుకొనుచుండెను; బ్రహ్మముగారు నవ్వుచు అయితే, నీవిది వఱకే ప్రయత్నించి యున్నావన్నమాట, అనుచు తనప్రక్కనున్న సిద్దయ్యనుచూచి సిద్ధా! నీవుపోయి వాళ్ళ నీవలకు రమ్మనుము; అనియె. వెంటనే సిద్దయ్య దొంగలను సమీపించి

ఓరీ! అయ్యగారు పిలుచుచున్నారు. వారిదగ్గరకు వెళ్ళుడు, అనిపల్కెను. అంత నాదొంగలొక్కరొకరే కదలి, యీవలకు వచ్చి నిలువబడిరి. బ్రహ్మముగారా మాటలను దించుడనిన తోడనే వారామాటలదించి, గురుమూర్తి పాదముల ముందు సాగిలపడి యూరక నేడ్వసాగిరి. అప్పుడు బ్రహ్మముగారి స్నేహితుడైన లింగావధూతగారు కేలుమోడ్చి, స్వామీ! వీళ్ళకీ ప్రాయశ్చిత్తము చాలును. వీళ్ళకునోటిమాటగాని, కను చూపుగాని లేనట్లు తోచుచున్నది. వీళ్ళు మనసా బాధపడు చున్నారు. యీపశ్చాత్తాపపనుల దుష్టకార్యమును క్షమించి యథాస్థితి దయచేసి పొమ్మనుడు. ధర్మాత్ములు దయాళులు నైన తమకుఁ దెలియనిదేమున్నది. అనియెను. అంతబ్రహ్మము గారు నవ్వుచు, యీ దుర్మార్గులను కఠినముగా దండించుట ధర్మమైనను, తప్పు తెలుసుకొని తపించుచున్నట్లు తోచు చున్నారుగనుక, మిత్రులగు మీ యీ దేశము మీరరానిదగు టను యింతటితో విడచుచున్నాడను, అనుచు తన చేతి బెత్త ముతో వాళ్ళను తాకి, మూర్ఖులారా! పోయి బుద్ధిగలిగి జీవింపుడు. యీమాదిరి కార్యములిక నెన్నడును చేయనెంచ కుడు; అని యీవలకువచ్చెను. వాళ్ళు వెంటనే లేచి, కనుచూ పులు నోటిమాటలురాగా, తెలివిగలిగిన వారై, సిగ్గుతో తలవంచుకొని దణ్ణములుపెట్టి పోయిరి. (యీదొంగలకు బుద్ధి వచ్చుటకై ప్రాయశ్చిత్తముగా వంచినతల లెప్పటికిని లేవ కుండునట్లు శపించెనని చరిత్రయందు కలదు.) ఆ చూడవచ్చిన గ్రామస్థులు బ్రహ్మముగారి శాంతస్వభావమును, న్యాయ

బుద్ధిని, మహిమాశక్తిని అనేక విధముల గొనియాడుచు మరలి పోయిరి.

కం. ప్రేయములందెడు వారిని
శ్రేయములం గాంచజేసెఁ జేతోవత్తుల్
న్యాయములం దెలియుటతో,
స్తేయము హేయమని వారికే బోధపడఁగ॥



## 30. ముగింపు

శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వాములవారు వారి జీవిత చరిత్ర యందింక నెన్నియో మహిమల ప్రదర్శించినట్లు, చెప్పబడియున్నది. మహిమలు చూపుటంటే గారడీల వంటివని నేటి నాగరికులభిప్రాయ పడినను, యోగశాస్త్ర సంప్రదాయము లెరింగినవారు మాత్రము వానిని విశ్వసించుచునే యున్నారు. శంకరాచార్యులు మున్నగు మహాత్ములు ఈ యోగవిద్య చేతనే. పరకాయ ప్రవేశము మొదలైన యద్భుత చర్యలతో ననేకములైన పనులు చేసినట్లు చరిత్ర చెప్పుచున్నది.

బ్రహ్మముగారు ఒకసారి శిష్యులతో కూడ మార్గవశాత్తుగా నొకయడవినే పోవుచు నా మార్గమున దిగువారిని నానాకష్టములపెట్టుచుండే యొక బ్రహ్మరాక్షసిని పట్టి, బలహీనంగావించి యొకచోఁబడియుండునట్లు చేసెనట. ఒకసారి కర్నూల్ నవాబుగారి దర్బారులో ప్రబోధమొనర్చి, వారి కోరిక ప్రకారముగా గూడి గుజ్జము కడుపులోనుండిన పిల్లల

యొక్క స్వరూపాదులు వర్ణించిచెప్పియు వారు మరియు కోరుటచే ప్రత్యక్షము గావించెనట.

ఒకసమయమున వారి పెద్దకుమారుడైన గోవిందస్వామి గారికి చలిజ్వరమువచ్చెనట. అది చాలరోజులుగా బాధించు చుండెను; నిలచియుండెను. ఆరోజులలో నొకప్పుడాయనగారిచే, నెరవేరవలసిన అవసరకార్యమొకటి తటస్థమయ్యెను. అది యెట్లు? ఇతరులు దానిని సమర్థించుటకు వలనుకాదు; అప్పుడు శ్రీ స్వాములవారు తమ యోగదండమునందా చలిజ్వరము నావేశింపజేయగా, నది గడగడ వణకసాగెనట. తదుపరి గోవిందాచార్యులుగా రెప్పటియారోగ్యస్థితి గలిగి యా పనిని చక్కగా నెరవేర్చినవాడయ్యెను. తరువాత శ్రీ వీర గురు మూర్తి యాయనతో, నాయనా! పురాకృత దోషములు వ్యాధుల రూపములతో, ప్రాణుల బాధింప గల్గును. ఆబాధలు తప్పక ననుభవింపవలసినదే. ఒకవేళనే చికిత్సారూపముననో వాటి బారినుండి తొలగినను జీవుడా యనుభవమునకై మరల జన్మింపవలసి యుండును. "ఇది తప్పనివిధి"అని యా జ్వర మును మరల యెప్పటిచోటికి బొమ్మనెనట. వెంటనే గోవింద య్యగారు చలిజ్వరము గలవాడయ్యెను. తరువాత కొన్నిరోజు లా జ్వరానుభవముపొంది యారోగ్యవంతుడయ్యెనట.

ఇట్లే క్రీస్తు మహాశయుడు కూడా తన మహిమవల్ల ననేకులైన ప్రజల వ్యాధి బాధల నద్భుతముగా బోగొట్టి యున్నాడు. మంచి నీరును ద్రాక్షారసముగా మార్చి యున్నాడు. శ్రీజేజినాయనగారు వారిమనుగడలో నీలాటి ప్రభా

వములు వేలాదిగా చూపి ప్రజాస్వామ్యమును, నిదురనుండి మేల్కొల్పి తప్పుదారినుండి తరలించినవాడై, తేట తెనుగు మాటలతో, కాలజ్ఞానాదులు బోధించెను. భావదాస్యము గాని. దురభిమానముగాని, యలవడిని యుపదేశములతో గురువై, గృహస్థుడై, ప్రకాశించి లోకకళ్యాణార్థముగా జీవ సమాధిలో తపస్సు చేయుచున్నాడు; వీరభోగ వసంతరాయలుగా ప్రజాపాలనముకొరకు ముందవతరింతు నని పల్కియున్నాడు. పాఠకులారా! వారి పవిత్ర చరిత్రయందలి పరమార్థము నెఱింగి ధన్యులుకండు.

తే॥గీ॥ అద్భుత ప్రభావముల, వేలాది జూపి
ప్రజలలో సద్వివేకము బాదుకొలిపి
మహిని బాలింప, జీవసమాధిలోన
వెలయుచున్నాడు శ్రీ విరాడ్వీరగురుడు॥

మంగళమ్ వేద వేదాంత విజ్ఞానోజ్వల మూర్తయే.

వీరబ్రహ్మేభిధేయాయ, దేశికేంద్రాయ మంగళమ్.

హరిః ఓం తత్సత్.

